ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్

Like us to follow
@mohanpublications




- చదులవాడ జయరామశాస్త్రి

# భీష్మస్తవ రాజము

శ్రీరస్తు

ఓమ్. నమోభగవతే వాసుదేవాయ

# భీష్మస్తవరాజము

మహాభారతాంతర్గతము

( టీకాతాత్పర్య సహితము )



విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రి



—: ప్రకాశకులు :—

రస్వతీ గ్రంథమాల

స్టోన్‌హౌసుపేట - నెల్లూరు

# ★ ప్రవేశిక ★



క్షణికములైన కతిపయ సుఖలేశాభాసములతోను, దురంతములైన బహుదుఃఖములతోను మిళితమైనది సంసారము. పురాకృతకర్మవశమున సంసారపంకమునఁబడి, అంతములేని చింతలంజివికి చీదఱగొన్న జీవి చిత్తమున కింత యూఱట చేకూర్పఁగలది యొక్క భగవద్ధ్యానముతప్ప మఱియొకటి లేదు. భగవద్భక్తి జీవితకాలమున చిత్తమునకు శాంతి నొసఁగుటయేకాక, జీవితాంతమున శాశ్వతానందమునుగూడ ప్రసాదించునని ఆస్తికులమైన మన విశ్వాసము. అందుకు మన తత్త్వశాస్త్రములు, భక్తుల చరిత్రములు మనకు ప్రమాణము.

శాశ్వతానంద మనఁగా మోక్షము. ఆ మోక్షమునకు ముఖ్యమయిన మార్గములు రెండు. 1. జ్ఞానమార్గము. 2. భక్తిమార్గము. ఆ రెంటను * జ్ఞానమార్గము క్లేశకరము.

---

* "క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహావద్భి రవాప్యతే.
యేతు సర్వాణి కర్మాణి మయి సంన్యస్యమత్పరాః,
అనన్యేనైవ యోగేన మాంధ్యాయంత ఉపాసతే.
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరా త్పార్థ మయ్యావేశిత చేతసామ్.
మయ్యేవ మన ఆధత్స్వమయిబుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః"

— గీత. భక్తియోగము.

భక్తిమార్గము దానికంటెను కొంచెము సులభము. అందు వలననే శ్రీకృష్ణుఁడు, అర్జునునకు "నీవు స్థిరమనస్కుఁడవై నీ బుద్ధిని నాయందిరవుకొల్పుము; అట్లయిన దేహాంతమున నీవు నాలో చేరిపోవుదువు; అందుకు సందేహము లేదు" అని భక్తిమార్గమునే యుపదేశించినాఁడు.

కాని, ఆ భక్తిపథమును అంతసులభము కాదు. భక్తి యనఁగా, దినము తప్పకుండ రేపును మాపును దేవళమునకు పోయి దేవునిదర్శించుట, టెంకాయలు కొట్టుట, పూవు లర్పించుట, పొర్లు దండములు పెట్టుట ఇత్యాది కృత్యములు మాత్రమే కాదు. భక్తికి చిత్తశుద్ధి ప్రధానము. "చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా?" అని వేమనయోగి హెచ్చరించెను గదా!

భక్తుఁడు కాఁగోరువాఁడు ముందు తన వర్తనమును చక్కఁబఱచుకొనవలెను. అందుకు-అహంకారము, ద్వేషము. అసూయ మొదలగు దుర్గుణములను దూరముగా తఱిమివేసి, శాంతము, సమభావము, సహనము, భూతదయ, నిత్య సంతుష్టి, దృఢనిశ్చయము, ఆత్మసంయమనము మొదలైన సుగుణముల నలవఱచుకోవలెను. తన మనస్సును - బుద్ధిని భగవంతునియందే పాదుకొల్పవలెను. అప్పటికిఁగాని యతఁడు భగవంతుని యనుగ్రహమునకు పాత్రము కాఁడు.

భక్తికుదిరినవానికి దేవుఁడు గుడిలోనే కాదు; ఎక్కడ చూచిన నక్కడనే కనఁబడును. ఆతనిదృష్టికి ప్రపంచ

మంతయు భగవన్మయమే యగును. ప్రతిపదార్థమును భగవత్స్వరూపముగనే తోఁచును. అట్టి నిర్మలభక్తిప్రకారమును నిరూపించునదే పవిత్రమైన యీ 'భీష్మస్తవరాజము'. (భీష్ముఁడు భగవంతునిఁ గూర్చిచేసిన యుత్తమ స్తవమని యర్థము.)

భీష్ముఁడు భారతవీరులలో నగ్రగణ్యుఁడు. భారత మహాసంగ్రామమున తొలుదొల్త రణరంగమున దుమికిన మొదటి జోదితఁడే. తొమ్మిది దినము లెదురులేనికడిమి వీరవిహారము చేసి, పదియవనాఁడు, తన్నెదుర్కొనిన శిఖండి – అంగనాపూర్వుఁడగుటచేత – వాని మొగముచూచి కయ్యమాడనియ్యకొనక, యుద్ధము మాని, పాలికలన నూరక నిలువఁబడెను. అప్పుడు శిఖండియు, శిఖండిని మాటుచేసికొని అర్జునుఁడును క్రూరశరములు గుప్పి, భీష్ముని శరీరమును ఛిన్నభిన్నముగావించిరి. శరవ్రణవేదన కోరువలేక భీష్ముఁడు, తన తనువు నేలసోఁకకుండ నమ్ములతల్ప మమర్చుకొని, దానిపై నొరిగెను. కాని అది దక్షిణాయనమగుటచేత ప్రాణములను పోనీక నిజదేహమున నిలువరించెను,

క్షత్రియునకు యుద్ధము చేయుట ధర్మముగావున చేసెనే గాని, భీష్ముఁడు వట్టి మోటుపోటుమానిసి కాఁడు. మహాజ్ఞాని. దేవాంశసంభూతుఁడు. అనితరసాధ్యమైన ఆ జీవిత బ్రహ్మచర్య వ్రతమును పూనిన యింద్రియజేత. సకలధర్మవేత్త. శ్రీకృష్ణ

పదార్పిత నిర్మలాత్ముఁడు. ధర్మతనయుని గెలిపింపనెంచి, తన్నుఁ బడఁగొట్టుట కుపాయము తానే చెప్పి, స్వేచ్ఛగా తనువును చాలించిన ధర్మపక్షపాతి. మఱియు విశేషించి, మరణమును తనవశమున నుంచుకొన్న మహానుభావుఁడు.

* ఆ మహనీయుఁ డుత్తరాయణము వచ్చువఱకును (56 దినములు) అంపశయ్యపై నశ్లేషరుండి, ధర్మజున కఖిలధర్మములును తెలియఁజెప్పి, ఉత్తరాయణము రాఁగానే అదితనకు మరణోచితకాల మని నిశ్చయించి, పలుకులు చాలించి, చిత్తము మనీషాయత్తముచేసి, చూపు శ్రీహరిమోముపై నిలిపి–కావించిన భగవద్గుణసంకీర్తనమే యేతద్గ్రంథరాజము. పంచమవేద మన నొప్పిన భారతేతి హాసమునఁగల తత్త్వ విచార ఘట్టములలో నిది యొకటి.

ఇందు పరమేశ్వరుని విశ్వాత్మకత్వము వినుతింపఁబడినది. ఋగ్యజురాది వేదములు, ఆదిత్యాదిగ్రహములు, ఆపో వాయ్వాది భూతములు, యజ్ఞహోమాది కర్మలు, కామ క్రోధాది గుణములు, అదియేమి–యిదియేమి భీష్ముని భక్తి భావనాదృష్టికి జగత్తంతయు భగవంతుఁడుగనే కనుపట్టినది. పరమాత్మయందు సక్తమైన హృదయమునకు పరమాత్మగాక

---

* భారతమున శాంతియందు భగవత్ స్తవము చేసినపిమ్మట ధర్మములు చెప్పినట్లున్నది. భాగవతమున ధర్మములుచెప్పి, అవసానకాలమున భగవంతుని స్తుతించినట్లున్నది.

పరపదార్థము తోఁచునా? అదేగదా భక్తి యోగ మహిమ. అట్టి యనన్యభక్తిసంపన్నుఁడు గావుననే ఆ మహాత్ముఁడు వాసుదేవ పరబ్రహ్మమునం దైక్యము కాఁగలిగినాఁడు.

"నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున యంచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు"

అన్న మహాభక్తశిఖామణి మందాకినీ నందనుఁడు. తన్నుఁ జంపవచ్చినవానియందును భక్తి చెడని ఆ దృఢనిశ్చయుని మించిన భక్తుఁడుండునా? ఆ పరిణతాత్ముఁడు చేసిన స్తవమునుమించిన స్తవ ముండునా?

కావున, ఈ స్తవరాజము - భగవంతునిస్తుతించి భవ సాగరము తరింపఁగోరు భవ్యాత్ములెల్లరును నిత్యమును పారాయణము చేయఁదగిన దనుటలో సందియమేమి?

సంస్కృతభాష నర్థము చేసికొనలేని తెలుఁగువారును, ఈ స్తవరాజమును సార్థముగాఁజదివి శ్రేయము పొందుదురు గాక యన్న సద్భావముతో-ప్రతిపదటీకా తాత్పర్య విశేషార్థ సహితముగా నిట్లు వెలువరించిన శ్రీ చదలువాడ జయరామ శాస్త్రిగారి జగదుపకారపరత ప్రశంసనీయము.

శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రభాషలయందు ప్రవీణు లగుటయేగాక పురాణేతిహాసముల నవలోడించియు, తత్త్వ

విద్యారహస్యముల నాకళించియు, అపారజ్ఞానము నార్జించిన యంతర్వాణులు. నైష్ఠికులు. శ్రీ శ్రీ కంచికామకోటి పీఠాధిపతుల యనుగ్రహామునకు పాత్రులుకానోచిన ధన్యులు. కావుననే తత్త్వార్థ ప్రధానమైన యీ స్తవరాజమును వ్యాఖ్యానింపఁ దలపెట్టి కృతార్థులు కాఁగలిగినారని నా విశ్వాసము.

శాస్త్రిగారి వివరణము సుష్ఠుగను, సుగమముగను, సరసముగను, సమగ్రముగను సాగినది. అవసరమగుపట్టుల నుపనిషద్వాక్యములు – పౌరాణికగాథలు పొందుపఱుపఁబడినవి. వారి బహుశాస్త్ర పరిజ్ఞాన మిందు ప్రతిపదమునను వ్యక్తమగుచున్నది.

ఆస్తికత తగ్గి నాస్తికత మొగ్గుచున్న యీ కాలమున నిట్టి దైవభక్త్యుద్బోధక గ్రంథములను విరచింప దొరకొన్న శ్రీ శాస్త్రిగారి లోకక్షేమాభిలాష కనేక ధన్యవాదములు. వారి యీ గ్రంథరచనా పరిశ్రమ మవిచ్ఛిన్నముగా కొనసాగునట్లును, వారిపరిశ్రమ కాస్తికులెల్లరును చేయూఁతయొసఁగునట్లును పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాత.

---

నెల్లూరు
15-12-57

దీపాల పిచ్చయ్యశాస్త్రి.

శ్రీ రామచంద్రాయనమః

శ్రీ సద్గురుశ్శరణమ్

# పరిచయము



బ్రహ్మశ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు ఆర్ష విజ్ఞాన ధురంధరులు, సదాచార సంపన్నులు, ప్రాచీన సాంప్రదాయపరులు, ప్రస్థానత్రయ భాష్యములను గురుముఖతః శాంతులు జరుపకపోయినను, పూజ్యశ్రీచరణులు జగద్గురువులు అస్మద్గురువరేణ్యులు, శ్రీ మత్పరమహంసేత్యాది బిరుదాంకితులగు, శ్రీ శ్రీ శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతుల యనుగ్రహ బలమున శ్రీవారి నారాయణస్మరణములతో దాదాపు పండ్రెండు సంవత్సరములుగా ప్రస్థానత్రయ భాష్యప్రవచనము జరుపుచున్నారు. ఆర్ష విజ్ఞానమును గొంతవరకైనను కథల రూపమున వెదజల్లుటకు గ్రంథకర్తృత్వము వహించినట్లు వీరి తొలిరచనలు సరస్వతీప్రసాదము, నందనవసంతములు, విశదపఱచుచున్నవి.

భీష్మస్తవరాజము తెలుఁగు భారతమున 40 పద్యములతో వెలుఁగొందుచున్నది. భాషలకెల్ల మాతృకయగు సంస్కృతభాషయందుఁగల స్తోత్రముల రసాస్వాదనఁ జేయ పండితులేగదా యనుభవజ్ఞులు. అట్టి శ్లోకములకు పదవిభాగ

ప్రతిపదార్థతాత్పర్య విశేష విషయములతోను, శ్రీ తిక్కన కవీంద్రచంద్రుని పద్యములతోను, అస్మదాదులకేగాక బాల బాలికలకుఁగూడ సుబోధకమగునటుల వ్రాసియనుగ్రహించిన శ్రీ శాస్త్రిగారు వందనీయులు.

(జాతస్యమరణంధ్రువమ్) మానవుల కవసాన దశ యందు కావలసినది భగవచ్చింతనమేగదా: కామ్యకర్మము లన్నియుదీరిన యనంతరము అంపశయ్యపైఁబరుండి భగ వంతుని సమస్తవర్ణనలతో స్తోత్రముఁజేసిన యీ భీష్మస్తవ రాజము సర్వమానవులకు అవశ్యపఠనీయమైన దగుటయేగాక బాలబాలికలకు పఠనీయగ్రంథము (Text book) గా హస్తముల నలంకరింప భూషణమై వెలుఁగొందుచున్నది. ఇంకను శ్రీ శాస్త్రిగారు శ్రుతిగీతలకు వ్యాఖ్యయు ఉపనిషత్కథలు, విక్రమ సింహపురి రామాయణాది ఉద్గ్రంథముల రచించుచున్నారు. త్వరలో వెలువడుఁగాకయని భగవంతుని ప్రార్థించెదను.

ఈ గ్రంథముద్రణమునకు సంపూర్ణ సాహాయ్య మొస ర్చిన సోదరి గం. భా. స. గాజులపల్లి పిచ్చమ్మగారు ఉత్త మోత్తమయగు అధ్యాత్మికగుణ సంపన్నురాలు, పుట్టినింటికి మెట్టినింటికి కీర్తిఁదెచ్చినధన్యురాలు గ్రంథకర్తకును, ముద్రణ దాతకును, ఇతోఽధికముగ ఆయురారోగ్యైశ్వర్యములు, ప్రసాదించుగాకయని శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థించుచున్నాను.

నాకు భాషాజ్ఞానము లేదనునదెఱింగియుండియు ఏమైన వ్రాయుమని యాజ్ఞాపించినారు, మా సంఘోపాధ్యక్షులు. (భగవద్గీతా భక్తసంఘమునకు అధ్యక్షులు, శ్రీకృష్ణపరమాత్మ, ఉపాధ్యక్షులు శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు) మా సంఘాధ్యక్షులొసంగిన సంకల్పబలము, గ్రంథకర్తగారైన ఉపాధ్యక్షులయాజ్ఞ ననుసరించి సంసారసాగరమును దాటుటకు నావయైన యీ స్తవరాజమునకు పరిచయవాక్యములు వ్రాయ సాహసమొనరించినందులకు పెద్దలు క్షమింపఁ బ్రార్థితులు.

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాంనమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

భగవద్గీత.

నెల్లూరు స్టోన్‌హౌస్ పేట
హేవళంబి మార్గశిర బ ౧౧
11-12-57

ఇట్లు బుధజనవిధేయుడు,
వంక లక్ష్మీనారాయణ.



శ్రీరస్తు

# అవతారిక



అసతోమాసద్గమయ తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మాఽమృతంగమయ. బృహదారణ్యకోపనిషత్తు. ౧-౩-౨౮

ఓ పరమేశ్వరా అసత్తునుండి నన్ను సత్తును జేర్చుము తమస్సునుండి నన్ను జ్యోతిస్సును జేర్చుము. మృత్యువు నుండి నన్ను అమృతమును జేర్చుమా.

అనిష్టనివృత్తికి ఇష్టప్రాప్తికి అలౌకికోపాయమును దెల్పునది వేదము ఇది ఋగ్యజుసామాథర్వములని చతుర్విధముగనుండును. కళంజ భక్షణాదులవలన నరకమును, జ్యోతిష్టోమాదులవలన స్వర్గమును బ్రాప్తించు ననుట వేదమువినా మఱేప్రమాణముచే నెఱుంగఁ దర్కశిరోమణిసైతము సమర్థుఁడు కానేరఁడు. ఇది ధర్మము, ఇది అధర్మము అని యెఱుంగ స్థూలబుద్ధికి గోచరముగాదు. ఇందు ధర్మ బ్రహ్మస్వరూపముల రెండింటిని దెల్పుచు పురుషార్థ సాధనములైన కర్మ + ఉపాసన + జ్ఞానకాండములని మూఁడుకాండములు గలవు. వేద చతుష్టయమును మంత్రద్రష్టలగు మహర్షులు స్వయంభువుఁ డనుమతి నీయగాఁ దపోబలమునఁ బడసిరి.

శ్లో. యుగాంతేఽంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః
తపసా లేభిరే పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా.

ఇట్టి వేదముల యర్థమెఱుంగుట సామాన్యులకలవిగాని పని. కావున వ్యాస భగవానుఁడు దయాళువై స్త్రీలు లోనగు వారికట్టి వేదములందుబాటుకావని తలంచి సర్వవేదముల యర్థమును బ్రకటించు భారతమును పంచమవేదముగా రచించెను.

శ్లో. స్త్రీశూద్ర ద్విజబంధూనాం త్రయీనశ్రుతిగోచరా
ఇతి భారత మాఖ్యానం కృపయామునినా కృతిమ్.

ఇట్టి భారతసుధాబ్ధియందు నిఖలపురుషార్థములఁ బ్రసాదించు పెక్కులుపాఖ్యాన రత్నములు జనించినవి. వానిలోఁ గేవలము ముముక్షువులకు సేవ్యములై 1. సనత్సుజాతీయము, 2. భగవద్గీత, 3. భీష్మస్తవరాజము, 4. విష్ణుసహస్రనామము, 5. బ్రాహ్మణగీత. అనునైదు గన్పట్టుచున్నవి.

వీనిలో ధృతరాష్ట్రునకు మనశ్శాంతిగలుగ బ్రహ్మమానస పుత్రుఁడు సనత్సుజాతుఁ డుపదేశించిన ఆత్మబోధ, సనత్సుజాతీయము, ఇది ఉద్యోగపర్వము. 41 మొ. 45 అధ్యాయములు 161 శ్లోకములుగలది. 2. సంగరరంగమున నర్జునుఁడు శోకమోహాక్రాంతుఁడుకాఁగా శ్రీకృష్ణభగవానుఁడు ఆ పాండవమధ్యముని శోకమోహములనడంపఁ జేసిన తత్త్వోప

దేశము భగవద్గీత. ఇది భీష్మపర్వమున 18 అధ్యాయములు 700 శ్లోకములు గలిగియున్నది. 3. భీష్మస్తవరాజము. దీనిని గూర్చి తర్వాతఁ జెప్పెదము. 4. విష్ణుసహస్రనామము. ఇది ధర్మజునికి భీష్ముఁడు పరమధర్మముగఁ జెప్పినది, అనుశాసనిక పర్వమునఁగలదు. ఇందు 143 శ్లోకములుగలవు.. 5. బ్రాహ్మణగీత, అర్జునుఁడు శ్రీకృష్ణుఁడు చేసిన ఉపదేశమగు భగవద్గీతార్థమును మఱచి మరలఁ జెప్పుమనఁగా మూఢుఁడవైతివని కరుణించి భగవానుఁడు తొల్లి సిద్ధోపదేశమును, ఆవల బ్రాహ్మణ బ్రాహ్మణీ సంవాదరూపమగు బ్రాహ్మణగీతలఁజెప్పి యర్జును సంశయములఁబాపెను. ఇది అశ్వమేధపర్వమున 19 అధ్యాయములును, దాదాపు 520 శ్లోకములు గలిగియున్నది. ఇవి అన్నియు నుపనిషదర్థమగు బ్రహ్మతత్త్వమును బ్రతిపాదించునవై యున్నవి.

సనత్సుజాతీయమున, సనత్సుజాతుఁడు, ధృతరాష్ట్రుఁడు గురుశిష్యులు. భగవద్గీతయందు శ్రీకృష్ణుఁడు, అర్జునుఁడు, గురుశిష్యులు. భీష్మస్తవరాజమున భీష్ముఁడే గురువు, భీష్ముఁడే శిష్యుఁడు. విష్ణుసహస్రనామమున భీష్ముఁడు, గురువు, ధర్మజుఁడు శిష్యుఁడు. బ్రాహ్మణగీతయందు బ్రాహ్మణుఁడు గురువు, బ్రాహ్మణి (ఆయన భార్య) శిష్యురాలు. సనత్సుజాతీయ భగవద్గీతా బ్రాహ్మణగీతలు మూఁడును శ్రవణమననములు చేయఁదగు శాస్త్రగ్రంథములై యున్నవి. విష్ణుసహస్రనామ, భీష్మస్తవరాజములు, నిత్యము జపములేక స్తోత్రము చేయఁదగు గ్రంథములై యున్నవి.

# భీష్మ స్తవరాజము

## భీష్ముఁడు

స్తవమునుగూర్చి చెప్పుటకుముందు స్తవకర్తయగు భీష్మునిఁగూర్చి యించుక వివరింతును. భీష్ముఁడు భారతవీరులలో మేలుబంతి. ఈయనజన్మమన్ననో త్రిలోకపావనయగు గంగా గర్భమున. తండ్రినిజాతుమాకుమారునికి స్వచ్ఛందమృతి ననుగ్రహింపఁగల తపోమహిముఁడు రాజర్షి శంతనుఁడు. భీష్ముఁడు కేవలమానవుఁడుగాదుసుఁడీ. అష్టవసువుల అంశము లతోఁగూడిన అష్టమవసునంశమునఁ బుట్టిన దేవకల్పుఁడు.

ఈయన వేదవేదాంగాధ్యయనము, వసిష్ఠాది బ్రహ్మర్షులకడ. ధనుర్వేదాధ్యయనము నడచినది భార్గవరాముదగ్గఱ. ఈయన శ్రీరామచంద్రునట్టివాఁడు. పితృవాక్యపరిపాలనముకై రాముఁడు రాజ్యమునుజ్జగించి వనవాసముచేసినట్లు భీష్ముఁడు తండ్రియగు శంతను వాంఛఁదీర్ప ఆజన్మాంతము బ్రహ్మచర్య వ్రతమను కఠోరదీక్షపొంది సామ్రాజ్యత్యాగముచేసి దాశరాజు కూఁతును సత్యవతిం దెచ్చి తండ్రికిం బెండిలిచేసినాఁడీ దేవవ్రతుఁడు. తండ్రులు కొమారులకుఁ బెండ్లిచేయుట లోకమునం బరిపాటి, కాని తండ్రికిం బెండ్లిసేయు కొడుకు లరుదుగ నుందురు. బహుశ ఈ విషయమున నితనికితఁడే సాటియగునేమో. ఒకవేళనిట్టివారున్న నొకరిద్దరుమాత్రముందురేమో. ఇతఁడు సచ్చరిత్రుఁడని మఱి చెప్పవలయునా?

సవతి తల్లికొడుకులగు చిత్రాంగదవిచిత్ర వీర్యులకుఁ బెండ్లి సేయఁగోరి కాశీరాజదుహితల, అంబాంబికాంబాలికల ముగ్వురఁ నిండు పేరోలగమున నుండువారి, స్వయంవరాలం కృతల నొక్కరుఁడే దనయరదము పైనిడికొని అడ్డము వచ్చిన భూమిపాలుర మదమడంచి వచ్చి తమ్ముల గృహస్థులం జేసిన వీరకులావతంసుఁడీ కురుపితామహుఁడు.

భీష్మానీతయైన యంబ పంపఁబడి సాళ్వుచే నిరాకృతయై కినుకనెంది భీష్మపైఁ గత్తికట్టఁ బ్రేరేచ వచ్చిన గురుఁడగు భార్గవరాముఁడు, భీష్మా నీవు అంబను పెండ్లియాడు మని శాసించినను అమ్మాట తనకుఁ బ్రతిజ్ఞా భంగమగునని గురుని ధిక్కరించి పదునెనిమిది దినములు గురునితో ఘోరయుద్ధము చేసి పెద్దల సూక్తిచే గురుతో సంధిఁగావించిన ధర్మవీరుఁడు, యుద్ధవీరుఁడీ శాంతనవుఁడు.

కొడుకులు మరణింపఁగుంది పినతల్లి సత్యవతి సంతాన విచ్ఛేదము, కురుకులమునకు దాపురమగుటయెఱింగి భీష్ముని బిలిచి తన కోడండ్రయందు దేవర న్యాయమున సంతతిఁగల్గింపు మని నొక్కివక్కాణించినను ఆయమమాటకీయకొనక తన ప్రతినవీడక వేదవ్యాస మహర్షి మూలమునఁ దల్లి యభీష్టము సిద్ధింపఁ జేసిన బ్రహ్మచారులకన్నాకు గాంగేయుఁడు.

పాండవులకు రాజ్యభాగమీయక వారి నిడుమలం బెట్టుచు సాగించిన దుర్యోధను దుర్ణయమును దుశ్చేష్టలను

పెక్కుమారులు ఖండించి ధర్మబోధ చేయుచుఁ బాడితప్పకున్న వాఁడీ భీష్ముఁడు. పాండవులు ధర్మపరులైనను దాను కౌరవుల కడనున్న వాఁడగుట సమయమప్పుడు తలదప్పించుట తగిన పాడిగాదని దుర్యోధను పక్షమున నిల్చి పదిదినములు చండ మార్తాండునిభంగి ఖండనము సల్పి పాండునందనులదండు ముప్పాతికపాలు చెండాడి వారి తలలకు వెఱ్ఱియెక్కించినంతఁ దుదకు ధర్మజుఁడజయ్యుఁడీ తాతయని గెల్పుగోరి వేడికొనఁగా వెరవుదెల్పిన లోకజ్ఞుఁడీజాహ్నవీ నందనుఁడు.

అంతనర్జునుఁడు శిఖండిని మున్నిడికొని పోరికి డీకొన వచ్చినంగాంచి యంగనాపూర్వునితో సంగరము చేయనన్న శపథము సుపథమునం బ్రవర్తిల్ల శరశరాసనముల ధరాతల మునం బడవైచి యంపసెజ్జ సేరినవాఁడు సత్యసంధుఁడైన యీ దేవవ్రతుఁడు.

పదంపడి శ్రీకృష్ణునిస్తుతించి ఆ భగవానునాజ్ఞచేఁ దన మనుమఁడు పాండవజ్యేష్ఠుఁడు కుంతీనందనుఁడు ధర్మ మూర్తియునైన ధర్మరాజునకు రాజధర్మములు, ఆపద్ధర్మ ములు మోక్షధర్మములు లోనగు సకలమానవ ధర్మములను శాంత్యనుశాసనిక పర్వములందు దాదాపు 25 వేల శ్లోక సంఖ్యగల భాగమును, "జనార్దనః ప్రీయతామ్", అని బోధించి వివరించి శ్రోతయైన ధర్మజుని, వక్తయైనతన్ను, వర్తమాన జనమును, భావికాలమువారగు అస్మదాదులను గృతార్థులను

జేసి భగవత్ప్రీతిపాత్రతముఁజై అజరామరమైన విమలయశ మును జగములందుఁ బ్రతిష్ఠించి ధన్యతముఁడైన రాజర్షి, జ్ఞాని, విజ్ఞాని, ధర్మాత్ముఁడు, గంగాశంతనుల తపఃఫలము, అష్టవస్వంశ సంభూతుఁడు స్వచ్ఛందమృతిగలవాఁడు భారత వీరాగ్రేసరుఁడు మన భీష్మాచార్యుఁడు.

---

## స్తవరాజప్రశంస



ఇట్టి పరిణతబుద్ధిం జెందిన భీష్ముఁడంపశయ్యఁ బరుండి స్తుతించిన మహాపురుష స్తవమే భీష్మస్తవరాజమనఁబడు చున్నది. ఈ స్తవమున సకలోపనిషత్సారమై ధ్యేయము, జ్ఞేయమునగు బ్రహ్మము. మహావిష్ణువేయని స్తుతింపఁబడినది. పురుషసూక్తము, నారాయణోపనిషత్తు, నారాయణము, వాసుదేవ, గోపాలతాపినీ కృష్ణోపనిషత్తుల తాత్పర్యమిందుఁ గానవచ్చుచున్నవి. ఉదాహరణముకై ఒకటిరెండు చూపు చున్నాను.

### పురుషసూక్తము

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
సభూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్.

## నారాయణోపనిషత్తు

ఓమ్ అథ పురుషోహవై నారాయణోఽకామయత ప్రజాస్సృజేయేతి
నారాయణాత్ప్రాణోజాయతే, మనస్సర్వేం ద్రియాణిచ
ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ.
నారాయణాద్బ్రహ్మాజాయతే నారాయణాద్రుద్రోజాయతే
నారాయణాదింద్రోజాయతే నారాయణాత్ప్రజాపతిః ప్రజాయతే
నారాయణాద్ద్వాదశాదిత్యారుద్రావసవస్సర్వాణి ఛందాంసి
నారాయణాదేవ సముత్పద్యంతే నారాయణాత్ప్రవర్తంతే
నారాయణేప్రలీయన్తే ఏతదృగ్వేదశిరోఽధీతే.

అథనిత్యోనారాయణః బ్రహ్మానారాయణః శివశ్చనారాయణః శక్రశ్చ నారాయణః, కాలశ్చనారాయణః, దిశశ్చనారాయణః, విదిశశ్చనారాయణః, ఊర్ధ్వంచనారాయణః, అధశ్చనారాయణః, అంతర్బహిశ్చనారాయణః, నారాయణఏవేదగ్ంసర్వం యద్భూతం యచ్చభవ్యం, నిష్కళంకో, నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతశ్శుద్ధోదేవ ఏకో నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్. యఏవంవేద స విష్ణురేవ భవతి ఏతద్యజుర్వేద శిరోఽధీతే.

## నారాయణీయములోని మంత్రపుష్పము.

సహస్రశీర్షం దేవంవిశ్వాక్షంవిశ్వశంభువం
విశ్వంనారాయణం దేవమక్షరం పరమంపదం
విశ్వతః పరమాన్నిత్యం విశ్వంనారాయణగ్ంహరిం
విశ్వమేవేదం పురుష స్తద్విశ్వముపజీవతి
పతింవిశ్వస్యాత్మేశ్వరగ్‌మ్ శాశ్వతగ్ శివమచ్యుతం
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానంపరాయణం
నారాయణపరో జ్యోతిరాత్మా నారాయణఃపరః

నారాయణపరంబ్రహ్మ తత్త్వంనారాయణఃపరః
నారాయణపరో ధ్యాతా ధ్యానం నారాయణఃపరః
యచ్చకించిజ్జగత్సర్వం వ్యాప్య నారాయణఃస్థితః
అనన్తమవ్యయంకవిగ్ం సముద్రేంతంవిశ్వశంభువమ్.

## వాసుదేవోపనిషత్తు

ఏకోవిష్ణుర నేకేషు జంగమస్థావరేషుచ
అనుస్యూతోవసత్యాత్మా భూతేష్వహమవస్థితః
తైలంతిలేషుకాష్ఠేషువహ్నిః క్షీరేఘృతంయథా
గంధఃపుష్పేషు భూతేషుతథాఽఽత్మాఽవస్థితోహ్యహమ్.

ఇట్టి యుపనిషత్తుల సారమంతయు స్తోత్రరూపమున వివరించునదీ భీష్మస్తవరాజము 121 శ్లోకములు గలది.

---

## స్తవరాజ పరిష్కారము



భీష్ముఁడు స్వచ్ఛందమరణము గలవాఁడగుటంజేసి తా నూర్ధ్వగతికింజనుటకు ఉత్తరాయణమువఱకు వేచియుండవలసి వచ్చెను. ఆ విషయమునే "నివృత్తమాత్రేత్వయనే ఉత్తరేవై దివాకరే" అను 3 వ శ్లోకమునఁ జెప్పఁబడినది. ఉత్తరాయణమున గతించినవారు. అర్చిరాదిమార్గమునఁబోయి సత్య లోకముంజేరి హిరణ్యగర్భుని సన్నిధిని బొందుదురని శ్రుతి వచించెడుఁ జూడుఁడు.

"తద్యఇత్థంవిదుః యేచేమేఽరణ్యే తపఇత్యుపాసతే తేఽర్చిషమేవ మభిసంభవన్త్యర్చిషోఽహా రహ్న ఆపూర్య

మాణపక్షు మాపూర్యమాణపక్షా ద్యాన్ షడుదజ్జ్ఞేతిమాసాగ్
స్తాన్, మాసేభ్యస్సంవత్సరగ్ సంవత్సరాదాదిత్య మాదిత్యా
చ్చంద్రమసం చంద్రమసోవిద్యుతం తత్పురుషోఽమానవ స్స
ఏనాన్ బ్రహ్మగమయ త్యేష దేవయానః పంథాఇతి,
ఛాందోగ్య. ప్ర. ౫. ఖం. ౧౦.

బ్రహ్మచర్యవ్రతమున నరణ్యమునఁ దపస్సు చేసినవారు నిష్కామకర్మలు చేసినవారు, పంచాగ్ని విద్యోపాసకులు. సగుణ బ్రహ్మోపాసకులు, పాంచభౌతికమైన స్థూలశరీరము వీడినంతన దివ్యశరీరధారులై జ్యోతిర్మార్గమునఁ బయనము సాగింతురు. జ్యోతిర్దేవతనుండి అహోదేవతను జేరుదురు. ఆ దేవతనుండి శుక్లపక్షదేవతను, దర్వాత మాసదేవతను, పదంపడి ఉత్తరాయణదేవతను, వెండి సంవత్సరదేవతను, ఆవల ఆదిత్యుని, పిమ్మట చంద్రునిఁ జేరుదురు. అంతనచ్చటికి అమానవుఁడగు విద్యుత్పురుషుఁడువచ్చి యీ బ్రహ్మవిదులను సత్యలోకమునకుఁగొంపోయి బ్రహ్మదేవుని సన్నిధిం జేర్చునని తాత్పర్యము.

కావఁబట్టి భీష్ముఁడుత్తరాయణము వచ్చినంతటనే తన బుద్ధిని పరమాత్మపై నిల్పెను.

సమావేశయ దాత్మానమాత్మ న్యేవసమాహితః. 3

మతిగోల అప్పుడే స్తుతింపవలయునా అన్న చివరిదశ దేనిని తలంచుచు ప్రాణములువీడుదురో దానిని పొందుదురు.

యంయంవాపి స్మరణ్ భావం త్యజత్యంతే కళేబరం
తంతమేవేతికౌంతేయ సదాతద్భావభావితః. భగవద్గీత. ౮. ౬.

కాఁబట్టి భగవంతుని ముఖ్యముగా అప్పుడు స్తుతించుట.

అట్లు భగవత్ప్రాప్తిఁగోరి భీష్ముఁడు పురుషార్థమును మహావిష్ణువును స్తుతింపఁగడంగెను. భీష్ముఁడెవ్వరినెట్లు స్తుతించి యేమగునో అని, చూతమన్న తమకమున వేదవ్యాసాది మహర్షులు 60 మందివఱకువచ్చి ఆయనను బరివేష్టించియుండిరి.

అంత భీష్ముఁడు త్రికరణ శుద్ధిగలవాఁడై (కర్మణా, మనసా, గిరా, 15.) నిర్గుణబ్రహ్మమును (శుచింశుచి పదంహం సం. 19) శరణుసొత్తును ఆ బ్రహ్మమతిగహనమైనది (అనాద్యంతం. 21–22) ఆ బ్రహ్మమునుండియే విశ్వముజనించి పూవుదండయందు పువ్వులవలె నిల్చియున్నది. (యస్మిన్ విశ్వాని, యస్మిన్నిత్యే 24–25.) ఆ బ్రహ్మము విరాట్పురుషుఁడు, (హరిం సహస్ర శిరసం, 25.) అతఁడే సూక్ష్మాకారుఁడు, అణువు, మహత్తు, గరిష్ఠుఁడు. (ప్రాహుః, గరీయసాం, 26, 27) చతుర్మూర్తి (గృణంతం. 28) మహిమోపేతుఁడు, (యందివ్యై 29) సగుణుఁడు, (సర్వాత్మా 30.) శ్రీకృష్ణుఁడు. (యందేవం, 31) సూక్ష్మదృష్టి గోచరుఁడు, 32. సృష్టికర్త. (అతివాయు, పురాణే, 33–34.) శరణ్యుఁడు, (యమేకమ్, 35–36.) జగన్మూలము. (యమాహుః, 37) ప్రణవప్రతీకుఁడు. (ఋతమేకాక్షరమ్, 38) దుఃఖభేషజము.

(అనాది నిధనమ్, 39.) సనాతనుఁడు. (యంవై విశ్వస్య, 40) అని ఇట్లు అఖండానందునిగ స్తుతించినాఁడు.

ఆనల ఈవిష్ణువే సర్వదేవతల రూపములతో మెఱయు చున్నాఁడని సూర్యాత్మనేనమః, సోమాత్మ నే న మః, అని ప్రారంభించి మ్రొక్కుచు —

సూర్యచంద్రాత్ముఁడు 41–42, జ్ఞేయవేదాత్ముఁడు. 43–44. యజ్ఞహోమస్తోత్రాత్ముఁడు, 45–47. హంసవాగ్వీర్యాత్ముఁడు, 48–50. నిద్రాత్ముఁడు, 51. సత్యధర్మాత్ముఁడు. 52–53. కామక్షేత్రాత్ముఁడు, 54–55. సాంఖ్యయోగమోక్షాత్ముఁడు, 56–58. ఘోరాత్ముఁడు, 59. మాయాపద్మయోగనిద్రాత్ముఁడు, 60–62. తోయాత్ముఁడు, 63. హేతుద్రష్టృకార్యాత్ముఁడు, 64–66. క్రౌర్యాత్ముఁడు, 67. వాయుకాలాత్ముఁడు, 68–69. వర్ణాత్ముఁడు, 70. లోకవిశ్వాత్ముఁడు, 71–72. గోప్త్రాత్ముఁడు 72. ప్రాణపాకాత్ముఁడు 74–75. దృష్టాత్ముఁడు, 76. సూక్ష్మాత్ముఁడు, 77. వీర్యాత్ముఁడు, 78. మోహాత్ముఁడు, 79. అనియు.

మత్స్య, కూర్మ, వరాహ, నృసింహాత్ముఁడు, 80–83. వామనోగ్రక్షత్రాత్ముఁడు, 84–86. శ్రీకృష్ణాత్ముఁడు, 87. బుద్ధకల్క్యాత్ముఁడు, 88. జ్ఞానదివ్యాత్ముఁడు, 90–91. బ్రహ్మాత్ముఁడు, 92. రుద్రాత్ముఁడు, 93–94. శాంత, సర్వ, విశ్వాత్ముఁడు, 95–97. సర్వమయకర్త్రాత్ముఁడు, 98–99. సగుణ

విస్తుణము, 100. విరాట్పురుషుఁడు, 101–102అని స్తుతించెను. పదంపడి స్తుతిఫలము, 103–105. ప్రణామము, 106–107. హరిమహిమ, 108–109. శరణాగతి, 110. వాగ్యజ్ఞార్చన, 111. నారాయణపరము, 112. ప్రణామము, 113. దివ్యజ్ఞాన దానము, 114. బ్రహ్మవిదర్చనము, 115. విప్రప్రశంస, 116. సపాండవ శ్రీకృష్ణాగమనము, 117–121. ఇట్టి విషయములతో భాసిల్లినదీ భీష్మ స్తవరాజము. మఱి యీ స్తవరాజమునందలి శ్లోకములకు టీకాతాత్పర్య విశేషార్థములు వ్రాయఁబడినవి. మఱియు మన తిక్కనసోమయాజి తెనిఁగించిన స్తవరాజపద్యములు గూడ నిందు పొందు పఱచినాను. మఱి బమ్మెరపోతన రచించిన భీష్మనిస్తుతి పద్యములుగూడ నిందు సమకూర్చినాను.

## దాతల ప్రశంస

"కర్తాకారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః
సుకృతేదుష్కృతేచైవచత్వారః సమభాగినః."

అను పెద్దలసూక్తిననుసరించి నా యీ రచించిన భీష్మ స్తవరాజముటీకా తాత్పర్యముద్రితమై గ్రంథరూపమున వెలువడుటకు ముఖ్యకారకులు మన నెల్లూరుమండల వేద పరిషత్కార్యదర్శులు, భగవద్గీతా భక్తసంఘ కార్యదర్శులు, బృహస్పతి సవనాది శ్రౌతక్రియానిర్వాహకులు, ఆర్షధర్మ ప్రవణులు, ప్రతివత్సరము వేదసభ జరిపి వేదాధ్యయన సంపన్నులకు ద్వ్యత్రిసహస్రరూప్యములపఱకు బహూకరించి సత్క

రించు నెఱదాతల వర్గమునందు ముఖ్యులు, సంస్కృతభాషాను రక్తులు, పండితకవుల పోషకులు, అన్నదానపరులు, గుణ గ్రాహులు సంపన్నగృహస్థులునగు బ్రహ్మశ్రీ వంక లక్ష్మీ నారాయణగారు. నేను వారిని సందర్శించి ఈ స్తవరాజమును గూర్చి ప్రస్తావించి నా చేసిన చెయ్యమును నివేదించి మీా బోంట్లు కొంతసాయపడుదురేని యీా పొత్తము ముద్రణము చేయఁగలనంటిని. అందుమీాదట వారు మంచిది ప్రయత్నింపుఁ డనిరి. వారేపదియో ఇరువదియో రూప్యముల నిత్తురేమో అని తలంచితిని. వారు గాంభీర్యగుణముగలవారు గనుక వారి భావము గ్రహింపలేకుంటిని. మఱొకమారీ విషయమునుజ్ఞప్తి పఱిచి కొంత సాయపడుఁడంటిని. అంతట వారు నేను గొంత సాయపడుటకాదు. పూర్తిగ్రంథమునే ముద్రింపయత్నింతు వనిరి, అందులకు నేను అచ్చెరువడి ఔరా! వీరి ఔదార్య మని అమందానంద భరితుఁడనై ఇదియకదా సాత్త్వికదాన మనియు ఇట్టికదా గీతాచార్యుఁడు, శ్రీకృష్ణభగవానుఁడు,

"దాతవ్యమితి యద్దానందీయతేఽనుపకారిణే
దేశేకాలేచ పాత్రేచ తద్దానంసాత్త్వికంస్మృతమ్."

అని, ఆనతిచ్చినాఁడని శ్రీవంక లక్ష్మీనారాయణగారి ఔదా ర్యము దీనికి అక్షరాల సరిపోవుచున్నదిగదా అనిసంతసించితిని. అప్రార్థితముగఁ జే స్తి సాహాయ్య... భక్తులనుటకిది యొక ముఖ్యకారణము. ...

ప్రకాశరమువారీ స్తనరాజ ముద్రణమునకువలయు రు. 500/-లు అయిదునందల రూప్యములను ఇప్పించి యిచ్చి సాయపడి ఈ గ్రంథమును ముద్రించి ప్రకటింపఁ జేయుచున్నారు. వారికి శ్రీకృష్ణపరమాత్మ నిరంతరము సర్వశ్రేయోదాయకుఁడగుగాత అని ప్రార్థించుచున్నాను.

క. శ్రీనాథుఁడు వంశాల
శ్రీనారాయణునిఁ బ్రోచు సిరిసంపదలన్
దీనావను ధీనావను
దానఘనున్ వేదధర్మధను సజ్జనునిన్. 1

సీ. నెల్లూరుమండల ముల్లసిల్లఁగ వేద
పరిషత్తుగాంచుతఁ బ్రాభవంబు
వేద వేదాంగాది విద్యలవైదుష్య
మొలయుఁగావుత విప్ర కులమునందు
షడ్దర్శనీత త్త్వ సారగ్రహణచణుల్
మంతురుగాక ధర్మప్రతిష్ఠ
కావ్యనాటక కళా భవ్యసాహితి కవుల్
పెంతురుగాక కవిత్వలక్ష్మి

తే. గీ. ఆర్ష ధర్మముప్రజలందు నలరుగాక
శ్రీమహావిష్ణువు మిమురక్షించుఁగాక
విమలవంశాన్వవాయశోభితశశాంక
లక్ష్మినారాయణాంక మీ లలితభక్తి. 2

# గ్రంథముద్రిణమునకు ధనమిచ్చిన ఉత్తమురాలు



శ్రీ వంక లక్ష్మీనారాయణగారికి సోదరీతుల్యయు గంగా భాగీరథీ సమానురాలగు గాజులపల్లి పిచ్చమ్మగారు మా భాష్యప్రవచన శ్రోతలలో ముఖ్యురాలు. తటాక + ఆరామ దేవాలయ, అగ్రహార, ధననిక్షేప, సత్ర, ప్రబంధనిర్మాణములను సప్తసంతానములలో సద్గ్రంథము వెలయించుట మిగుల శ్రేష్ఠమనునది జగద్విదితము. మున్ను రాజాధిరాజులగు రాజరాజనరేంద్రుడు, కృష్ణదేవరాయలుమున్నగు మహనీయులు కవుల వలన సద్గ్రంథముల కృతిఁగాంచిరి. వారియశముఇప్పటికిని వారి పరోక్షమున జగమున భాసిల్లుచున్నదిగదా, అను నిట్టి సద్బుద్ధి మనంబున నిడి పిచ్చమ్మగారు శ్రీ లక్ష్మీనారాయణగారి మాట యందు గౌరవము, నాయందు విశ్వాసము, స్తవరాజమున భక్తియు, సంపూర్ణముగనుంచి గ్రంథమునకు వలయునంత ముద్రణవ్యయ ధనమునొసఁగి భరించిన భక్తురాలు ఈ స్తవ రాజమీ యుత్తమురాలికి యుత్తమసంతానమై వరలుగాక. శ్రీకృష్ణభగవానుఁడు ఈ పిచ్చమ్మగారికి పూర్ణాయురారోగ్యైశ్వర్యముల నొసంగి యనుగ్రహించుగాక. అని ఆ పరమేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

నేను ప్రార్థించినంతన, కార్యాంతర నిమగ్నులై యుండియు నా మీఁది నెయ్యమున నా యీ స్తవరాజమునకు

"ప్రవేశిక" సార్థకముగ వ్రాసియిచ్చిన విమర్శకాగ్రేసర, విద్వాన్, ఇత్యాది బిరుదాంకితులు, రసవత్కృతులు, వాక్చతురతా సమ్మోదిత రసజ్ఞులు, గద్యపద్యచంపూనాటకాది బహుప్రబంధ రచయితలు, బహుగ్రంథ విమర్శకులు ఆశ్రిత బంధులు, సహృదయులునగు బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లొనర్చు చున్నాను.

అట్లు నా వేడికోలునంగీకరించి భీష్ములవారి అంపశయ్య చిత్తురువును వ్రాసియిచ్చిన శ్రీ ఎన్. జగన్నాథరావుగారికి వందనములు సమర్పించుచున్నాను. మఱి ఈ గ్రంథమును చక్కగ ముద్రించియిచ్చిన ఉమాప్రింటర్సు ప్రొప్రయిటరు శ్రీ బి. రంగయ్యగారిని మఱియు నభినందించుచున్నాను.

ఇట్లు
సద్భక్తవిధేయుఁడు,
చదలువాడ జయరామశాస్త్రి.

నెల్లూరు
హేవళంబిమార్గశిర బ౧౫ లు
సోమవారము 15-12-57





# ★ ఆశీస్సు ★



శా. శ్రౌతన్ వేదవిచారశీలుఁడిల భారద్వాజ గోత్రుండు శ్రీ
సోలా వేంకటనరసయాహ్వయుఁడు మెచ్చఁగూరగార్హస్థ్యముం
బాలున్ నీరునుబోలె నేకమతి నమ్మాయమ్మయిల్లాలుగాఁ
బోలంగల్గెఁదనూజ లచ్చిబలె నంభోరాశిఁ బిచ్చమ్మనన్. 1

తే. గీ. అన్నపూర్ణయమ్మాయమ్మ యన్నదాన
మహిమ మహి మించనాయమ్మ మక్కువసుత
యెలమిఁబిచ్చమ్మ గృహిణియై యెసఁగెఁబుట్టి
నింటికిన్ మెట్టినింటికి నిడుచుఁగీర్తి. 2

మ. ఇలఁగౌండిన్యసగోత్రు సుబ్బయను నెం తేఁగూర్మిఁ జేపట్టిగా
జులపల్ల్యన్వయకైరవాప్తుఁ బతిఁదా సొంపారెఁ బిచ్చమ్మ వి
ప్రుల వేదజ్ఞుల భక్తులన్ ధనములన్ బుణ్యాత్ములందన్పుచున్
నలినాక్షామలభక్తితత్పరత నానందైక సంవిన్మతిన్. 3

తే. గీ. కాశి రామేశ్వరమ్ము గోకర్ణమాయ
నంతశయనమ్ము బదరిం బిచ్చమ్మ యన్ని
తీర్థయాత్రలు సేసె భక్తిమతి ధర్మ
బుద్ధి వెలయ దివ్యక్షేత్రములను గాంచె. 4

మ. కలికాలంబున భక్తికల్పలతలన్ గాటంపుఁ జెల్మిన్ మదిన్
మొలకెత్తించిచిగుర్పఁబూయఁగుతుకంబుంగాంచుభక్తుల్ ధరన్
గలికంబుంగొన నచ్చటచ్చటను నింకంగొందఱున్నారు సా
ధ్వులు శ్రీగాజులపల్లి పిచ్చమవలెం బూతల్ సుభక్త్యాశ్రయల్.

ఉ. శ్రీ జయశాలి మాధవుఁడు శేషశయానుఁడు విష్ణుఁడచ్యుతుం
డీ జయరామశాస్త్రికృత మీ స్తవరాజము ముద్రితంబుగా
రాజిలఁ జేయుభక్తపరురాలి వదాన్యవతిన్ దయామతిన్
గాజులపల్లి పిచ్చమను గంజదళాక్షుఁడుగాచుఁగావుతన్. 6





# భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట

(శ్రీ భాగవతాంతర్గతము బమ్మెరపోతన కృతము.)



మ. త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింపఁ బ్రాభాత నీ
రజ బంధుప్రభమైన చేలముపయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాఁడు మదినావేశించు నెల్లప్పుడున్.

మ. హయరింఖాముఖధూళి ఘూసరపరి న్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థునకిచ్చు వేడ్క నని నాశస్త్రాహతిం జాలనొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు
నశ్రాంతమున్.

మ. నరుమాటల్ వినినవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరులీక్షింప రథంబునిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేలి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై.

క. తనవారిఁ జంపఁజాలక
వెనుకకుఁ బోనిచ్చగించు విజయునిశంకన్
ఘనయోగవిద్యఁ బాపిన
మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

సీ. కుప్పించియెగసినఁ గుండలంబులకాంతి
గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న
జగములవ్రేఁగున జగతిగదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ
బైనున్నపచ్చని పటముజాఱ
నమ్మితినాలావు నగుఁబాటుసేయకు
మన్నింపుమని క్రీడి మరలఁదిగువఁ

తే. గీ. కరికిలంఘించు సింహంబు కరణిమెఱసి
నేఁడుభీష్ముని జంపుదు నిన్నుఁగాతు
విడువుమర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁగాచుట మహాధర్మంబు వామ్మంచు స
ర్జున సారథ్యము ప్రానిపగ్గములు చేఁజోద్యంబుగాఁబట్టుచున్
మునికోలన్ వడిఁబూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహమునొందఁ జేయుపరమోత్సాహుం బ్రశంసించెదన్.

క. పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించు ఘనుని గొలిచెదమదిలోన్.

ఆ. వె. మునులునృపులుఁ జూడ మునుధర్మజుని సభా
మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది
దేవుఁ డమరునాదు దృష్టియందు.

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబులహృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు, నట్టిహరి నేఁ బ్రార్థింతుఁ శుద్ధుండనై.

శ్రీరస్తు

శ్రీగణాధిపతయేనమః

ఓమ్ నమోభగవతే వాసుదేవాయ

# భీష్మస్తవరాజము

జనమేజయ ఉవాచ

శ్లో. "శరతల్పే శయానస్తు భారతానాం పితామహః
కథ ముత్సృష్టవాన్ దేహం కంచ యోగ మధారయత్." 1.

టీక. జనమే జయః = జనమేజయుఁడు ఉవాచ=పలికెను. - శరతల్పే = అమ్ములశయ్యయందు, శయానః + తు. పండుకొని యున్న వాఁడయ్యు, భారతానాం _ భరతుఁడను రాజు వంశీయులైన కౌరవ పాండవుల యొక్క, పితామహః = తాతయైన భీష్ముఁడు, దేహం = శరీరమును కథం + ఉత్సృష్టవాన్ = ఎట్లు వీడెను, కం చ యోగం = ఏ యోగమును, అధారయత్ = ధరించెను.

తా. జనమేజయుఁడు వైశంపాయను నడుగుచున్నాఁడు. మహాత్మా, కౌరవులకును పాండవులకును తాతయైన భీష్ముఁడు అంపశయ్యమీదఁ బండుకొనియుండి కడపట తన పాంచ భౌతికమగు దేహము నే విధమున వీడెను. ఆ సమయమున నే

యోగమును, లేక ఏ ధ్యానమును గావించెను; చెప్పుము. (తండ్రి వరముచే దనకు స్వచ్ఛందమృతిఁ బ్రసాదించుటవలన నందఱివలెఁగాక విశేషముండునని ప్రశ్న)

విశేషము:- పాండవులకుఁ గౌరవులకు సంగ్రామము వాటిల్లినపుడు వారి పితామహుఁడగు భీష్ముఁడు ధృతరాష్ట్రసుతులవంక నిల్చి యుద్ధముచేసెను. ఆయన శౌర్యమున కాఁగలేక పాండవులు ద్రుపదుని పెద్దకొడుకును - మున్ను స్త్రీగానుండి పురుషుఁడైన శిఖండియనువానిని - మున్నిడుకొని భీష్ము నెదిరింపఁ బోయిరి. అంగనాపూర్వునితో భీష్ముఁడు కయ్యమాడనని ప్రతినవట్టియున్నవాఁడు గావున నాతనితోఁ గయ్యమున కియ్యకొనక శరశరాసనములఁ గ్రిందఁ బడవైచి యూరకుండెను. అర్జునుఁ డాశిఖండిని చాటుచేసికొని పితామహుని బాణముల నొప్పించి మూర్ఛిల్లఁజేసెను. అట్టివానిఁ గౌరవులుగొనిపోయి యాపాలికలని సమీపముననుంచిరి. అతఁడప్పు డమ్ములతో నొక్కసెజ్జ నేర్పఱచి తుదినసువులు పోవుదాఁక దానిపైఁ బవళించి ధర్మరాజునకు ధర్మములు చెప్పుచుండెను.

వైశంపాయన ఉవాచ.

శ్లో. ॥ శృణు ష్వావహితో రాజన్ శుచి ర్భూత్వా సమాహితః
భీష్మస్య కురుశార్దూల దేహోత్సర్గం మహాత్మనః. 2.

టీక. వైశంపాయనః = వైశంపాయనుఁడు, ఉవాచ పలికెను. రాజన్ = ఓరాజా, కురుశార్దూల = కురువంశ శ్రేష్ఠుఁడా,

అవహితః = జాగరూకత గలవాఁడవై, శుచిః = పరిశుద్ధుఁడవు, సమాహితః = చిత్తము నిశ్చలముగాఁ జేసికొన్నవాఁడవు, భూత్వా = అయి, మహాత్మనః = మహాత్ముఁడైన, భీష్మస్య = భీష్మునియొక్క, దేహ + ఉత్సర్గం = దేహమును వీడుటనుగూర్చి శృణుష్వ = వినుము.

తా. ఓ జనమేజయమహారాజా, జాగరూకుఁడవై శరీరము మనస్సు పరిశుద్ధములుగానుండ మనస్సును ఏకాగ్రముగఁ జేసికొనుము. ఓ కురువంశశ్రేష్ఠుఁడా, మహాత్ముఁడైన భీష్ముని దేహత్యాగమునుగూర్చి చెప్పెదను వినుము.

శ్లో. నివృత్త మాత్రే త్వయనే ఉత్తరే వై దివాకరే।
సమావేశయ దాత్మాన మాత్మన్యేవ సమాహితః॥ 3.

టీక. దివాకరే = సూర్యుఁడు. ఉత్తరే - అయనే = ఉత్తరాయణమునందు, నివృత్తమాత్రేతుసతి = ప్రవర్తించినవాఁడగుచుండఁగా, సమాహితః = (భీష్ముఁడు) చిత్తమేకాగ్రముచేసికొన్నవాఁడై, ఆత్మానం = బుద్ధిని, ఆత్మని + ఏవ = (తన హృదయములోపలనున్న) పరమాత్మయందే, సమావేశయత్ = చక్కఁగఁ సమకూడుకొనఁ జేసెను.

తా. సూర్యుఁ డుత్తరాయణ గతుఁ డగు చుండఁగనే భీష్ముడు తన చిత్తము నిశ్చలము చేసికొని తన బుద్ధిని తన హృదయాకాశమున వెలుంగు పరమాత్మయందే నిల్పుకోఁగలిగెను.

శ్లో॥ "శుక్లపక్షస్యచాష్టమ్యాం మాఘమాసస్య పార్థివ।
ప్రాజాపత్యేచనక్షత్రే మధ్యంప్రాప్తే దివాకరే॥" 4.

టీ. పార్థివ = ఓ రాజా, మాఘమాసస్య = మాఘమాసము యొక్క, శుక్లపక్షస్య = శుక్లపక్షముయొక్క, అష్టమ్యాం = అష్టమీ తిథియందు, ప్రాజాపత్యే = ప్రజాపతి దేవతాకమైన, నక్షత్రే = నక్షత్రమునందు, (రోహిణీ నక్షత్రమునందు) దివాకరే = సూర్యుఁడు, మధ్యం = ఆకాశ మధ్యభాగమును, ప్రాప్తేసతి = పొందిన సమయమునందు.

తా. మాఘశుద్ధాష్టమి, రోహిణీనక్షత్రయుక్తదినము మధ్యాహ్నవేళ సూర్యుఁ డాకాశమధ్యగతుఁడై యున్న సమయమునందు ధ్యానింపఁ దొడంగెను.

శ్లో. "వికీర్ణాంశు రివాదిత్యో భీష్మ శ్శరశతై శ్చితః
శుశుభే పరయా లక్ష్మ్యా వృతో బ్రాహ్మణసత్తమైః" 5.

టీ. వికీర్ణాంశుః = చెల్లాచెదరైన కిరణములుగల, ఆదిత్య ఇవ = సూర్యుఁడువలె, భీష్మః = భీష్ముఁడు, శరశతైః = బాణ ముల వందలచేత, చితః = ఒప్పినవాఁడై, బ్రాహ్మణ సత్తమైః = బ్రాహ్మణశ్రేష్ఠులచే, పరివృతః = చుట్టఁబడినవాఁడై, పరయా + లక్ష్మ్యా = ఉత్కృష్టమైన కాంతితో, శుశుభే = శోభిల్లెను.

తా. కిరణములన్నియు నలుఁగడలఁ జెల్లాచెదరై యున్న సూర్యునివలె భీష్ముఁడు దనచుట్టును బాణములు

నందలకోలేని పడియుండఁగా బ్రాహ్మణోత్తములు వచ్చి తన చెంత నుండగా మేలైనశోభతో నొప్పారెను.

శ్లో. "వ్యాసేన వేదవిదుషా నారదేన సురర్షిణా
దేవస్థానేన వాత్స్యేన తథాశ్మక (తేనే) సుమంతునా. 6.

తథా జైమినినా చైవ పైలేనచ మహాత్మనా
శాండిల్య దేవరాతాభ్యాం మైత్రేయేణచ ధీమతా. 7.

అసితేన వసిష్ఠేన కౌశికేన మహాత్మనా
హారీత రోమశాభ్యాంచ తథాత్రేయేణ ధీమతా." 8.

టీ. వేదవిదుషా = వేదములన్నింటిని నెఱింగిన, వ్యాసేన = వేదవ్యాసునితోడను, సురర్షిణా = దేవర్షియైన, నారదేన = నారదునితోను, వాత్స్యేన = వత్సుఁడను ఋషివంశమునందు జనించినవాఁడైన, దేవస్థానేన = దేవస్థానుఁడను ఋషితోను, తథా = ఆ ప్రకారము, అశ్మక సుమంతునా = అశ్మకుఁడను నామాంతరము గల సుమంతునితోను, జైమినినా + చ + ఏవ = జైమిని మహర్షితోను, మహాత్మనా, మహాత్ముఁడైన పైలేనచ = పైలునితోను, శాండిల్య + దేవరాతాభ్యాం = శాండిల్యుఁడు దేవరాతుఁడను ఋషులతోడను, ధీమతా = బుద్ధిమంతుఁడైన, మైత్రేయేణచ = మైత్రేయునితోడను, అసితేన = అసితుఁడను ఋషితోను, వసిష్ఠేన = వసిష్ఠునితోను, మహాత్మనా = మహాత్ముఁడైన, కౌశికేన = కౌశికునితోను,

హారీత + రోమశాభ్యాంచ = హారీతుఁడు రోమశుఁడనువారల తోను, తథా = ఆ ప్రకారము, ధీమతా = బుద్ధిమంతుఁడైన, ఆత్రేయేణ = ఆత్రేయునితోడను.

తా. వేదవిద్వాంసుఁడైన వ్యాసుఁడు, దేవర్షియైన నారదుఁడు వత్సవంశమువాఁడైన దేవస్థానుఁడు. వ్యాస శిష్యులైన సుమంతుఁడు, జైమిని (ఇతఁడు పూర్వమీమాంసా ప్రవర్తకుఁడు) పైలుఁడు, శాండిల్యుఁడు, (భక్తి సూత్రములు రచించినవాఁడు. ఇతని పేర నుపనిషత్తునుగలదు) దేవరాతుఁడు, ధీమంతుఁడైన మైత్రేయుఁడు (విదురునికి భగవత్తత్త్వము బోధించినవాఁడు) అసితుఁడు, వసిష్ఠుఁడు, మహాత్ముఁడైన విశ్వామిత్రుఁడు, హారీతుఁడు (స్మృతికర్త) రోమశుఁడు (పాండవు లరణ్యావాసము చేయుచుఁ దీర్థ యాత్రలు గావించునప్పుడు సాయపడి తీర్థమహిమలఁ జెప్పిన వాఁడు.) ఆత్రేయుఁడు (వాసుదేవుని శిష్యుఁడు) లోనగు మహర్షులు భీష్మునిఁ బరివేష్టించియుండిరి.

శ్లో. "బృహస్పతిశ్చ శుక్రశ్చ చ్యవనశ్చ మహామునిః
సనత్కుమార కపిలా వాల్మీకి స్తుంబురుః కురుః. 9.

మౌద్గల్యో భార్గవో రామ స్తృణబిందు ర్మహామునిః
పిప్పలాదశ్చ వాయుశ్చ సంవర్తః పులహః కచః. 10.

కాశ్యపశ్చ పులస్త్యశ్చ క్రతు ర్దక్షః పరాశరః
మరీచి రంగిరాః కాశ్యో గౌతమో గాలవో మునిః. 11.

ధౌమ్యో విభాండో మాండవ్యో ధౌమ్రః కృష్ణానుభౌతికః
ఉలూకః పరమో విప్రః మార్కండేయో మహామునిః. 12.

భాస్కరిః పూరణిః కృష్ణః సూతః పరమధార్మికః"

పై శ్లోకములలోఁ గేవలము పేరులు గనుక టీక వ్రాయలేదు.

దేవతలకు గురువైన బృహస్పతి, రాక్షసులకు గురువైన శుక్రుఁడు, చ్యవనుఁడు = శర్యాతియను రాజర్షి కన్యను, సుకన్యయను దాని వివాహమాడిన భృగువంశీయుఁడు. తన ముదిమిఁ బోవ వైద్యముచేసి యౌవనము గలిగించిన అశ్వనీ దేవతలకు యజ్ఞములందు హవిర్భాగములఁ గల్పించినవాఁడు గొప్పముని, సనత్కుమారుఁడు = బ్రహ్మమానసపుత్రుఁడు, నారదునికి భూమ విద్యనుపదేశించినవాఁడు. ఈ విద్య ఛాందోగ్యోపనిషత్తునందు, సప్తమ ప్రపాఠకమునఁ గలదు. కపిలుఁడు మహావిష్ణు నవతారమైనవాఁడు దేవహూతి కర్దములపుత్రుఁడు తనతల్లి కుపదేశించుట ద్వారా సాంఖ్యదర్శనమును లోకమున వెల్లడించిన మహానియుఁడు సాగరుల హతిమార్చిన తపస్వి, వాల్మీకి = శ్రీరామాయణకర్త, (గావచ్చును) తుంబురుఁడు. నారదుని మేనల్లుడు, తన మేనమామతోఁ గూడి దేవసభయందు గానము చేయువాఁడు, కురువు, భార్గవరాముఁడు = పరశురాముఁడు, విష్ణు నవతారమైనవాఁడు ఇరువదొక్కమారు దండయాత్ర చేసి రాచపురువు లేకుండఁ జేసినవాఁడు మహావీరుఁడు భీష్మునికి ధనుర్విద్యాగురువు, తృణబిందువు = గొప్పముని, పిప్పలాదుఁడు=సుకేశుఁడు, సత్యకాముఁడు లోనగు

గృహస్థు లడిగిన షట్ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము సెప్పి బ్రహ్మతత్త్వముపదేశించిన బ్రహ్మర్షి వీరికథ ప్రశ్నోపనిషత్తు నందు గలదు. వాయువు, సంవర్తుఁడు = ఇతఁడు బృహస్పతి భ్రాత మరుత్తుఁడను రాజర్షి ప్రార్థింప నింద్రబృహస్పతుల ధిక్కరించి యాతనిచే యాగముచేయించిన మహాప్రభావ సంపన్నుఁడు దిగంబరుఁడు బ్రహ్మవిదుఁడు, పులహుఁడు = బ్రహ్మపుత్రులైన నవబ్రహ్మలలో నొకఁడు, కచుఁడు=బృహస్పతి పుత్రుఁడు దేవతలకొఱకుఁ బోయి శుక్రుని శుశ్రూషించి మృత సంజీవని మంత్రముపదేశమంది వచ్చినవాఁడు. గురు పుత్రి దేవయాని తన్నువలచి పెండ్లియాడమన్నను సోదరివని నిరాకరించి ఆమె శాపమునకుగుఱియై వెలువని సచ్చరిత్రుఁడు, కాశ్యపుఁడు, క్రతువు, దక్షుఁడు = నవబ్రహ్మలలోనివారు. పులస్త్యుఁడు రావణాది రాక్షసుల వంశమునకు మూలపురుషుఁడు. దక్షుఁడు పరమశివునకు తనకూఁతును సతీదేవి నిచ్చి మామయైనవాఁడు, కశ్యపుఁడు, చంద్రుఁడు, ధర్ముఁడు అనువారల భార్యలు, ఈయన కూతుండ్రు, లోకసృష్టికి హేతుభూతలైనవారు. పరాశరుఁడు=వేదవ్యాసునితండ్రి విష్ణుపురాణకర్త, వసిష్ఠుని పౌత్రుఁడు, శక్తిమహాముని పుత్రుఁడు. మరీచి, అంగిరుఁడు = నవబ్రహ్మలలోనివారు. అంగిరుఁడు బృహస్పతితండ్రి, కాశ్యుఁడు = ఇతఁడొక రాజర్షి. గౌతముఁడు = ఉద్దాలకుఁడు, ఆరుణియనుపేరులు గలవాఁడు శ్వేతుకేతుని తండ్రి, బ్రహ్మవిదుఁడు,కుమారునికి సద్విద్యనుపదేశించినవాఁడు, గాలవుఁడు=

ప్రఖ్యాతిగలమహర్షి, ధౌమ్యుఁడు = పాండవుల పురోహితుఁడు, విభాండకుఁడు = ఋశ్యశృంగునితండ్రి తపోధనుఁడు, మాండవ్యుఁడు = సప్తర్షులు మెచ్చుకోఁదగ్గ తపముగలవాఁడు, తనకు అన్యాయముగా శిక్షవిధించిన యముని శూద్రయోనింబుట్టుమని శపించెను, యముఁడంత విదురుఁడై పుట్టెను. ధౌమ్రుఁడు, కృష్ణానుభావితుఁడు, ఉలూకుఁడు=ఉత్తమవిప్రుఁడు, మార్కండేయుఁడు = మృకండువనుఋషికి శివుని వరమున జనించి మృత్యువునుజయించి సప్తకల్పములు బ్రదికియుండు చిరంజీవి సదా షోడశవర్ష ప్రాయుఁడు, గొప్పఋషి, భాస్కరి, పూరణుఁడు, కృష్ణుఁడు, సూతుఁడు = రోమహర్షణుపుత్రుఁడు, ఉగ్రశ్రవుఁడు అను పేరుగలవాఁడు, శౌనకాది మహామునులకు అష్టాదశపురాణములు చెప్పిన పౌరాణికుఁడు, గొప్పతపస్వి ఉత్తమధార్మికుఁడు, లోనగువారు భీష్మునిఁ బరివేష్టించియుండిరి.

శ్లో. "శైబ్యేన యాజ్ఞవల్క్యేన శంఖేన లిఖితేనచ. 13
ఏతైశ్చాన్యై ర్మునిగణై ర్మహాభాగై ర్మహాత్మభిః
శ్రద్ధా దమ శమోపేతై ర్వృత శ్చంద్రఇవ గ్రహైః". 14

టీ. శైబ్యేన = శైబ్యుఁడను రాజర్షితోడను, యాజ్ఞవల్క్యేన = యాజ్ఞవల్క్యునితోడను, శంఖేన లిఖితేనచ = శంఖలిఖితులతోడను, ఏతైః + చ = వీరితోడను, అన్యైః = ఇతరులైన, మునిగణైః = మునిగణములైన, మహాభాగైః = చాల దొడ్డవారైన, మహాత్మభిః = మహాత్ములైన, శ్రద్ధా+

దమ + శమ + ఉపేతైః = శ్రద్ధ, దమము, శమము అను వానితోఁ గూడినవారితోడను, గ్రహైః + వృతః = గ్రహము లతోఁజుట్టఁబడిన, చంద్రఇవ = చంద్రుఁడువలె ప్రకాశించెను.

తా. శైబ్యుఁడు=ఇతఁడొక రాజర్షి. యాజ్ఞవల్క్యుఁడు జనక రాజుగురువు, వైశంపాయనునిశిష్యుఁడు. ఇతఁడు తన గురుని వీడి, సూర్యునికడ వేదమభ్యసించినవాఁడు. జనకుని యజ్ఞ సదస్సునందు బ్రహ్మవాదమున నెల్లఋషుల జయించిన దొడ్డ ఋషి. ఈయన భార్యలు మైత్రేయి, కాత్యాయని, యను వారు. మైత్రేయి భర్తదగ్గఱ బ్రహ్మవిద్యనేర్చి బ్రహ్మ విదు రాలైనది. శంఖలిఖితులు = వీరిపేర స్మృతులుగలవు హంస ధ్వజుఁడను మహారాజుదగ్గర ధర్మాధికారులుగ నుండినవారు. శ్రద్ధ, దమము, శమముగల ఇట్టి మహర్షులతోఁగూడిన భీష్ముఁడు గ్రహపరివృతుఁడైన చంద్రునివలెఁ బ్రకాశించెను.

### తిక్కన తెనిఁగింపు

వ. ఆ సమయంబున నక్కడం బారాశర్య నారద దేవల దేవస్థాన, వాత్స్య దేవరాత ప్రభృతి పరమమునీంద్ర పరివేష్టనంబు, గలిగి గాంగేయుండు గ్రహగణ పరివృతుండైన చంద్రుండునుం బోలె శోభిల్లి సందర్శనీయ గభస్తి వితా నుండగు నస్తమయ భానుంద్రేణిసేయుచుఁ గృష్ణుఁ జిత్తంబున నిరతిశయనిష్ఠ నిలిపికొనియుండి, చేతులు మొగిడ్చి సుపుష్ట స్వరంబున నిట్లని స్తుతియించె.

శ్లో. భీష్మ స్స పురుషవ్యాఘ్రః కర్మణా మనసా గిరా
శరతల్పగతః కృష్ణం ప్రదధ్యౌ ప్రాంజలి శ్శుచిః. 15

టీ. పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుఁడైన, సః+భీష్మః = ఆ భీష్ముఁడు. శర + తల్ప + గతః = అంపశయ్యనుబొందిన వాఁడై, ప్రాంజలిః = చేతులుదోయిలించుచు, శుచిః = పరిశుద్ధుఁడై, కర్మణా + మనసా + గిరా = క్రియచేతను మనస్సుచేత, వాక్కుచేతను, కృష్ణం = శ్రీకృష్ణుని, ప్రదధ్యౌ = ధ్యానించెను.

తా. పురుషశ్రేష్ఠుఁడైన యా భీష్ముఁ డంపశయ్యమీఁదఁ బండుకొని నమస్కరించుచుఁ ద్రికరణశుద్ధిగ శ్రీకృష్ణుని ధ్యానము చేసెను.

శ్లో. స్వరేణ హృష్టపుష్టేన తుష్టావ మధుసూదనమ్
యోగీశ్వరం పద్మనాభం విష్ణుం జిష్ణుం జగత్పతిమ్. 16

టీ. హృష్టపుష్టేన=సంతోషము, తృప్తి, పొందిన,స్వరేణ=కంఠస్వరముతో, మధుసూదనం = మధువను రక్కసుని సంహరించినవాఁడును, యోగి + ఈశ్వరం = కర్మయోగులకు, జ్ఞానయోగులకు ప్రభువును, పద్మనాభం = కమలము నాభియందు గలవాఁడును, విష్ణుం = సర్వలోకములు వ్యాపించినవాఁడును, జిష్ణుం=జయశీలుఁడును, జగత్పతిం = లోకములకెల్ల ప్రభువు నైనవాని, తుష్టావ = స్తుతిఁ చెను.

తా. సంతసముతోఁ దనివొందిన కంఠస్వరముతో మధువనురక్కసునిఁ బరిమార్చినవాఁడును, నాభియందు సర్వసృష్టికిఁ గారణభూతమై బ్రహ్మకు నుత్పత్తిస్థానమైన కమలము గలవాఁడును, లోకమంతట వ్యాపించుటవలన విష్ణువనియు, అందఱ జయింపఁగలుగుట జిష్ణుడనియు, పేర్లుగలిగి, జగములకుఁ బ్రభువైన మహావిష్ణువును స్తుతించెను.

శ్లో. కృతాంజలిపుటో భూత్వా వాగ్విదాం ప్రవరః ప్రభుః
భీష్మః పరమధర్మాత్మా వాసుదేవ మథాఽస్తువత్. 17

టీ. వాగ్విదాం = వాక్కుల తత్త్వము దెలిసిన వారలలో, ప్రవరః = శ్రేష్ఠుఁడను, ప్రభుః=నిగ్రహానుగ్రహ సమర్థుఁడును, పరమధర్మాత్మా = ఉత్తమములైన ధర్మములతోఁ గూడిన బుద్ధిగలవాఁడునగు, భీష్మః = భీష్ముఁడు, కృతాంజలిపుటః + భూత్వా = తన రెండు చేతులను దొప్పవలె జోడించుచున్న వాఁడై ,అథ = అంతట, వాసుదేవం = వసుదేవుని పుత్రుఁడైన, లేక లోకములందెల్ల నివసించు శ్రీకృష్ణుని, అస్తువత్ = స్తుతించెను.

తా. అంత వాక్తత్త్వము దెలిసిన వారలలో నుత్తముఁడును సమర్థుఁడును. పరమధార్మికుఁడు నైన భీష్ముఁడు తన రెండు హస్తములు చేర్చి నమస్కరించుచు వసుదేవపుత్రుఁడై లేక సర్వలోకములందు నివసించుచు వానిని ప్రకాశింపఁజేయు శ్రీకృష్ణుని స్తుతించెను.

భీష్మ ఉవాచ.

శ్లో. ఆరిరాధయిషుః కృష్ణం వాచం జిగదిషామి యాం
తయా వ్యాససమాసిన్యా ప్రీయతాం పురుషోత్తమః. 18

భీష్మః = భీష్ముడు, ఉవాచ = పలికెను.

టీ. కృష్ణం = శ్రీకృష్ణుని, ఆరిరాధయిషుః = ఆరాధింపఁ గోరినవాఁడనై, యాం+వాచం = ఏ వాక్కును, జిగదిషామి = వాకొనఁ గోరుచున్నానో, వ్యాసనమాసిన్యా = విస్తరించిన తత్త్వముల నెల్ల సంగ్రహించునదైన, తయా = ఆ నా వాక్కుచేత, పురుషోత్తమః=పురుషులలో (జీవులలో) ఉత్తముఁడైన దేవుఁడు. ప్రీయతాం = సంతోషించుఁగాక.

తా. వాస్తవికమగుతత్త్వమును నిశ్చయించుటద్వారా శ్రీకృష్ణుని నారాధింపఁగోరి నేను, ఏ వాక్కును, వాకొన నభిలషించు చున్నానో విస్తరించిన తత్త్వముల నెల్ల సంగ్రహించునదైనయానా వాక్కుచేఁ బురుషోత్తముఁడు (పురి యనఁగా శరీరము. అందు శయనించినవారు పురుషులు = జీవులు, వారిలో నుత్తముఁడు. వారి పుట్టువునకుఁ గారణ భూతుఁడైన పరమాత్మ.) సంతసించుఁగాక.

శ్లో. శుచిం శుచిపదం హంసం తత్పదం పరమేష్ఠినమ్
యుక్త్వా సర్వాత్మనాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్. 19

టీక. శుచిం = స్వయముగను, ఇతరమైన అవిద్యాదిక మంటకుండుట చేతను నిర్మలుఁడును, శుచిపదం = అట్టి నిర్మల మగు మోక్షమునకు స్థానమైనవాఁడును, (పాఠాంతరము)

శుచిషదం = నిర్మలమైన ఆకాశమున ఆదిత్య రూపమున నుండువాఁడును, హంసం = అన్నింటిని దాటి యంతట నుండు వాఁడును, తత్పదం = తత్త్వమసియను మహావాక్యములోని తత్ = అనుదానికి లక్ష్యార్థమైన పరమాత్మస్థానమైన వాఁడును, పరమేష్ఠినం = అన్నిలోకములకు మీఁద నుండువాఁడును, ప్రజాపతిం = సర్వలోకములను సృజించి సర్వప్రజలకు ప్రభువై యుండు, ఆత్మానం = అన్ని ప్రాణులకు ఆత్మయైన, తం = ఆ దేవుని, సర్వాత్మనా = అన్నివిధముల చేతను మనోవాక్కాయములతో, యుక్త్వా = కూడుకొని, ప్రపద్యే = శరణు పొందెదను.

తా. స్వయముగఁగాని, అవిద్యా కామకర్మములవలనఁ గాని యే దోషములు లేక పరిశుద్ధుఁడై యుండువాఁడును, అట్టి అవిద్యాదులవలన నేదోషము పొరయని శుచిపదమును అనఁగా మోక్షపదమునుబొందు మార్గమగు యోగము గల వాఁడును, అనఁగా నిర్మల యోగానుష్ఠానమునఁ బొందఁదగిన వాఁడనుట, శుచిషత్తు = శుచియనఁగా నిర్మలమైన ఆకాశము హృదయాకాశము (దహరాకాశము) అందు ఆదిత్యరూపమున (జ్యోతియై) నెలకొన్నవాఁడును, అన్నింటిని అతిక్రమించి యుండుటవలన అన్నిప్రాణుల శరీరములందు వర్తించుట చేతను హంసుఁడను పేరుగలిగినవాఁడును, తత్త్వమసియను మహావాక్యములోని తత్ అను పదమునకు లక్ష్యార్థమైన యీశ్వరుఁడైనవాఁడును, అన్నింటికి మీఁదనుండుచుఁ బర

మేష్టి, హిరణ్యగర్భుఁడు, అను పేరులుగన్న వాఁడును, సర్వ ప్రాణుల హృదయములందును అంతర్యామియై యుండు వాఁడును, అఖిల బ్రహ్మాండమును స్థూలమును సృజించి సర్వ ప్రజలకుఁ బ్రభువై ప్రజాపతియను పేరుగన్నవాఁడునైన యీ పరబ్రహ్మమును అన్నివిధములఁ గూడుకొన్నవాఁడనై (మనో వాక్కాయములతో ననుట) శరణు పొందుచున్నాను.

ఈ శ్లోకమందు

సచ్చిదానందమగు నిర్గుణ బ్రహ్మమును, మాయను, ఉపాధిగాఁగలిగి అంతర్యామియని పేరొంది కేవల సాత్త్వికుఁడు, మహాకారణశరీరుఁడైన యీశ్వరుఁడును, సకల ప్రాణుల సూక్ష్మశరీర సమిష్టిభూతుఁడై సూత్రాత్మయను పేరొందిన హిరణ్యగర్భుఁడును సకలప్రాణుల స్థూలశరీర సమిష్టి స్వరూపుఁడగు విరాట్టును. అని బ్రహ్మము నాలుగు విధములుగ స్తుతింపఁబడినది. సత్త్వ రజ స్తమోగుణములకు, జాగ్రత్స్వప్న సుషుప్తులకును, మూలమై యుండు వీరివరుసను, వ్యష్టిరూపమున అనఁగాఁ బ్రతిశరీరమునందు భిన్నులై కనుపట్టు విశ్వ తైజస ప్రాజ్ఞులు వీరి సంబంధులే యగుదురు. తురీయావస్థ నిర్గుణ బ్రహ్మమునకుఁ జెందినది.

శ్లో. అనాద్యంతం పరంబ్రహ్మ నదేవా నర్షయో విదుః
ఏకోఽయం వేద భగవాన్ ధాతా నారాయణో హరిః. 20

టీక. అనాది + అంతం = ఆది, అంతము, మొదలు, తుద, అనఁగా జన్మమరణములు లేనివాఁడైన, పరం + బ్రహ్మ = పరుఁ

డైన బ్రహ్మమును, దేవాః + న + విదుః = దేవతలు గుర్తెఱుంగరు. న + ఋషయః + విదుః = ఋషులు గుర్తెఱుంగరు. ఏకః = ఒక్కఁడైన, అయం = ఈ, భగవాన్ = భగవంతుఁడైన, ధాతా + నారాయణః + హరిః = ధాత, నారాయణుఁడు, హరి, అను పేరులుగల దేవుఁడే, వేద = సర్వము బ్రహ్మమును (దేవతలుగాని ఋషులుగాని యెఱుంగలేకున్నను) ఎఱింగిన వాఁడు. ఆద్యంతములు జన్మనాశములు మొదలు తుదలు లేక పరిపూర్ణమైన యే పరబ్రహ్మముగలదో ఆ బ్రహ్మమును దేవతలుగాని ఋషులుగాని యెఱుంగ లేకున్నారు.

తా. జగముల సృజించువాఁడై ధాతయనియుఁ, బ్రాణులఁ బోషించుచు, ఆ జీవులకుఁ బొందఁదగు మార్గము లేక గమ్యస్థానమై యుండుటవలన నారాయణుఁడనియు, జీవుల పాపముల హరించువాఁడు లేక సర్వమును ప్రళయమున లయింపఁ జేయువాఁడగుట హరియనియు, జీవుల రాకపోకలు, భూత భవిష్య ద్వర్తమానములగు మూఁడుకాలముల నెఱింగిన వాఁడును లేక సమగ్రమైన యైశ్వర్యము, (ప్రభుత్వము) వీర్యము, (బలము, పరాక్రమము) యశము, సిరి, జ్ఞానము, వైరాగ్యము, అనునీయాఱింటిని గలిగి షడ్గుణైశ్వర్య సంపన్నుఁ డగు భగవంతుఁడైన యావిష్ణువొక్కఁడే యా నిర్గుణబ్రహ్మ మెఱుంగును. (అతఁడే ఇతఁడనుట). బ్రహ్మము సంగతి బ్రహ్మమే యెఱుంగును. అని భావము.

శ్లో. నారాయణా దృషిగణా స్తథా సిద్ధమహోరగాః
దేవా దేవర్షయ శ్చైవ యంవిదుః పర మవ్యయమ్. 21

టీ. నారాయణాత్ = ఆ నారాయణునివలన, ఋషిగణాః = ఋషుల సమూహములును, తథా = ఆ ప్రకారము, సిద్ధ + మహోరగాః = సిద్ధులు, నాగులును, దేవాః = దేవతలును, దేవర్షయః + చఏవ = దేవర్షులుఁగూడ, యం = ఏ, అవ్యయం = నాశరహితుఁడైన, పరం = పరుని (పరమాత్మను) విదుః = గుర్తెఱుంగుచున్నారో.

తా. ఆ నిర్గుణ బ్రహ్మమును దెలిసినవాఁడు నారాయణుఁ డొక్కఁడేయై యున్నందున ఆ నారాయణునివలన ఋషిగణములు, అట్లు సిద్ధులు, నాగులు, దేవతలు, దేవర్షులు లోనగువారు ఏ అవ్యయుఁడై నాశరహితుఁడైన పరుని ఉత్కృష్టుని లోకాతీతుని పరమాత్మను గుర్తెఱుంగుచున్నారో.

శ్లో. దేవ దానవ గంధర్వా యక్షరాక్షస పన్నగాః
య న్నజానంతి కోహ్యేష కుతోవా భగవానితి. 22

టీ. దేవ....ర్వాః = దేవతలు, దానవులు, గంధర్వులు, యక్ష – గాః = యక్షులు, రాక్షసులు, పన్నగులు, ఏషః = ఈ భగవాన్ = భగవంతుఁడు, కః + హి = ఎవఁడై యున్నాఁడు, కుతః + వా = ఎట్లువచ్చినాఁడు, అని, యత్ = ఏ పరబ్రహ్మమును, న + జానంతి = గుర్తెఱుంగలేరో.

తా. దేవతలు, దానవులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు, ఈతఁడెవ్వఁడు, ఎట్టివాఁడు, ఎట్లు

వచ్చినాఁడు. (అనఁగా ఈయనకు మూలకారణ మేమైనఁ గలదా) ఆ భగవంతు డెవఁడని యే పరబహ్మమును దెలియ నేరరో.

శ్లో. యస్మిన్ విశ్వాని భూతాని తిష్ఠంతిచ విశంతిచ
గుణభూతాని భూతేశే సూత్రే మణిగణా ఇవ. 23

టీ. యస్మిన్ = ఏ పరమేశ్వరునియందు, విశ్వాని + భూతాని = సమస్తభూతములు, (ప్రాణులు) తిష్ఠంతిచ = నిలిచి యున్నవో (భగవంతుఁ డాధారమైయుండగా నిల్చియున్నవో యనుట) విశంతిచ = ప్రవేశించియున్నవో, భూతేశే = సర్వ భూతములకీశ్వరుఁడైన వానియందు, మణిగణాః = రత్నముల సమూహములు, సూత్రే + ఇవ = దారమునందువలె గుణ భూతాని త్రిగుణాత్మకములైన భూతములు లేక శబ్ద, స్పర్శ, రూప రసగంధములను గుణములుగల పంచభూతములు నిల్చి యున్నవో, ప్రవేశించియున్నవో.

తా. ఏ పరమేశ్వరునియందు సర్వభూతములు జన్మ మును బొంది జీవయాత్ర సాగించుచున్నవో, ఏ భగవంతుని యందుఁ గడపట లయమొందుచున్నవో, ఏ భూతేశ్వరుని యందు త్రిగుణాత్మకములైన జీవకోటులుగాని, లేక వానికి కారణములై శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను గుణ ములు గల పంచభూతములుగాని దారమునందు మణులవలె గ్రుచ్చుకొనియున్నవో దారమాధారముగ నుండిననే కదా

రత్నములు హారముగా నేర్పడుట అట్లే భగవంతునిపై జీవ రాసు లాధారపడినవని భావము.

శ్లో. యస్మి న్నిత్యే తతే తంతౌ దృఢే స్రగివ తిష్ఠతి
సదస ద్గ్రథితం విశ్వం విశ్వాంగే విశ్వకర్మణిః. 24

టీ. నిత్యే = నిత్యుఁడై, విశ్వాంగే = విశ్వమునకు (లోకమునకు) అధిష్ఠాన భూతమైన శరీరముగలవాఁడై, విశ్వకర్మణి= విశ్వమును సృజించుట యను కర్మగలవాఁడైన, యస్మిన్ = ఏ పరమేశ్వరునియందు, సత్ + అసత్ + గ్రథితం = సత్తు తోను, అసత్తుతోను, (కారణ కార్యములతో) గూడుకొన్న విశ్వం = ఈ జగము, తతే = విస్తరించినఁ (పొడవైన) దృఢే = గట్టిదైన, తంతౌ = దారమునందు స్రక్ + ఇవ = పూవులదండ వలె, తిష్ఠతి = నిల్చియున్నదో.

తా. ఈ విశ్వమున కంతకు నధిష్ఠాన భూతమైన (ఆధారమైన) తనువు గలవాఁడై విశ్వమును సృజించుటయను కర్మ గలవాఁడై దేశకాలవస్తువులచే మార్పొందక నిత్యుఁడై వ్యాపకుఁడైన యే పరమాత్మునందు సత్తు, అసత్తు అను వానితోఁ గూడిన, అనఁగా సర్వజీవుల హృదయమందు వెలుఁగొందుచున్న యంతర్యామియను పేరొంది కారణ రూపుఁడైన యీశ్వరునితోడను, సర్వజీవులయొక్క సూక్ష్మ శరీరములకుఁ గుదురై, కార్యభూతుఁడై సూత్రాత్మ యను పేరొందిన హిరణ్యగర్భునితోడను గూడుకొన్నదై యీ విశ్వము నిల్చియున్నదో.

సత్తు = కారణము నిత్యము (మృత్తు = మట్టి)
అసత్తు = కార్యము అనిత్యము (ఘటశరావాదికము)

కోహ్యేవాన్యాత్, కః ప్రాణ్యాత్ = అనుశ్రుతిని బట్టి ఏ ప్రాణియు ఆ పరమాత్మ యనుగ్రహము లేక ప్రాణాపానక్రియ (ఉచ్ఛ్వాస నిశ్వాసములు గైకొనుటగూడ) సైతము జరుప లేదు. అని తెలియవలెను.

తిక్కన తెనిఁగింపు

సీ. శుచియను హంసుండు శుచిషత్తు పరముండుఁ
బరమేష్ఠియును నగు భవ్యుఁ గొలుతు
మునులును సురలు నెవ్వనియున్న రూపెఱుం
గరు, సర్వవిదుని నప్పురుషుఁ గొలుతు
శ్రుతులు సెప్పఁగ మహామతులు దుఃఖాపథం
బుగ నెఱింగెడు పుణ్యమూర్తిఁ గొలుతు
లోకంబులెల్లఁ గల్గుట నిల్చుటడగుట
తనయంద యగు మహోత్తరునిఁ గొలుతుఁ

గీ. బక్షి రత్నచయంబుఁ బుష్పవ్రజంబుఁ
బంజరముఁ ద్రాడు నార యు పాశ్రయముగ
నుండుచాడ్పున విశ్వంబు నుండుటకు సు
ఖాస్పదంబగు పుండరీకాక్షుఁ గొలుతు.

శ్లో. హరిం సహస్రశిరసం సహస్ర చరణేక్షణమ్
సహస్ర బాహుమకుటం సహస్ర వదనోజ్జ్వలమ్. 25

హరిం = ప్రళయమునందు సర్వప్రపంచమును దనలో లయింపఁ జేసికొనువాఁడును, లేక భక్తులయొక్క, ఆధ్యాత్మిక + ఆధిదైవిక, ఆధిభౌతికములను త్రివిధ దుఃఖములను బోనడంచువాఁడునై హరి యను పేరుగన్నవాఁడును, సహస్ర చరణ + ఈక్షణం + వేయిపాదములు వేయికన్నులు గల వాఁడును, సహస్రబాహు మకుటం = వేయిబాహువులు, వేయి కిరీటములు గలవాఁడును, సహస్రవదన + ఉజ్జ్వలం = వేయి మొగములతోఁ బ్రకాశించువాఁడును, అని చెప్పాదురో పై శ్లోకమునఁగల తాత్పర్యము సులభము. ఆధ్యాత్మికమగు దుఃఖము = శారీరకములైన వ్యాధులు, మానసికములైన చింతలు, ఆధిదైవికము = క్షామము, అతివృష్టి, ఝంఝా మారుతము, పిడుగులుపడుట, యక్షరాక్షస వినాయకాదుల వలని బాధ. ఆధిభౌతికము = శత్రు సర్ప వృశ్చిక వృకాదుల వలని యపకృతి విషాదులచేత నగుబాధ,

ఆ. వె. హరిసహస్రశీర్షుఁ బరము సహస్రాక్షు
వేదమయు సహస్రపాదు నలఁతు
లైనవారికంటె నలఁతి పెద్దలకును
జాలఁ బెద్దయగు దయాళు గొలుతు. 3

శ్లో. ప్రాహు ర్నారాయణం దేవం యంవిశ్వస్య పరాయణమ్
అణీయసా మణీష్ఠంచ స్థవిష్ఠంచ స్థవీయసామ్. 26

టీ. యం = ఎవనిని, విశ్వస్య = లోకమునకు, పరాయణం = ఉపాస్యునిగను, సుఖకరునిగను, అణీయసాం = అణువులలో (మిగుల చిన్న నలుసులలో) అణీయాంసం = పరమాణువుకంటె మిగుల సూక్ష్మతమునిగను, స్థవీయసాం = స్థిరముగ నుండువానిలో, స్థవిష్ఠంచ = ఎక్కువ స్థిరముగనుండు వానిగను, నారాయణం = నరులనఁగాజీవులు. వారి సమూహములు నారములు. వారికి అయనము ప్రాప్యము, లేక పొందఁదగినవాఁడు. లేక అట్టిమార్గమై లేక స్థానమై యుండు, దేవం=జ్ఞానప్రకాశుఁడైన దేవునిగ, ప్రాహుః=చెప్పుచున్నారో

తా. బ్రహ్మవిదులెవ్వని, లోకమున కుపాస్యుఁడు, సుఖప్రదుఁడనియు, అణువులలో నణువును, స్థిరమైనవానిలోఁ మిగుల స్థిరుఁడును. (అనఁగా ఆ దేవునికంటె నణువైనదియు, స్థిరమైనదియు లేదనుట) ముముక్షువులగు జీవులకుఁ బ్రాప్యమై, నారాయణుఁడని పేరుగని జ్ఞానరూపమున స్వయంప్రకాశుఁడైన వానిఁగాఁ జెప్పుచుందురో.

శ్లో. గరీయసాం గరిష్ఠంచ శ్రేష్ఠంచ శ్రేయసా మపి
యం వాకే ష్వనువాకేషు నిష త్సూ పనిషత్సుచ. 27

టీ. యం = ఎవనిని గరీయసాం = మిగులభారమైన వానిలో, గరిష్ఠంచ=అత్యంత భారమైన వానిగను, శ్రేయసాం=

శ్రేష్ఠమైనవానిలో, శ్రేష్ఠంచ = మిగుల శ్రేష్ఠమైన వానిగను వాకేషు = వాక్యములందు అనఁగా ఋగ్యజుస్సామములను వేదములందు సామాన్యముగఁ గర్మలను, బ్రకాశింపఁ జేయు నవియైన సంహితాభాగములందలి మంత్రముల వాక్యములందును, అనువాకేషు = అట్టిమంత్రముల యొక్క అర్థములను వివరించునట్టి బ్రాహ్మణభాగములందలి వాక్యములందును, నిషత్సు = కర్మముల కంగములై వానివలనఁగలుగు స్వర్గాది ఫలముల నెఱింగించు శ్రుతులవాక్యములందును, ఉపనిషత్సు = కేవలము పరమాత్మ తత్త్వమును దెలుపు వేదాంతములగు నుపనిషత్తులయందును,

తా. బ్రహ్మవేత్తలు, ఏ దేవుని మిగుల భారమైన వానిలో నెక్కుడు భారమైనవానిగను, శ్రేష్ఠమైనవానిలో శ్రేష్ఠునిగను, వేదములందలి మంత్రముల వాక్యములందును, బ్రాహ్మణ వాక్యములందును, కర్మఫలములఁ దెల్పు వాక్యములందును, ఉపనిషత్తుల వాక్యములందును, బ్రకాశించువానిఁగను, ధ్యానము చేయుచున్నారో.

కేవలకర్మ ప్రకాశ వాక్యము: "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" = వేదాధ్యయనము చేయవలెను, "అహరహ స్సంధ్యాముపాసీత" = ప్రతిదినము సంధ్యనుపాసించవలెను. అగ్నిహోత్రం జుహోతి = అగ్నియందు హోమము చేయుచున్నాడు.

ఫలప్రకాశక వాక్యము : "అగ్నిహోత్రం జుహుయాత్స్వర్గ కామః" = స్వర్గకాముఁ డగ్నిహోత్రమునందు హోమము చేయవలెను.

కర్మాంగమైన గుణవాక్యము : "సోమేన యజేత" = సోమముతో (సోమలతా రసముతో) యాగము చేయవలెను.

కర్మాంగములైన ఫలవాక్యము : "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత"=స్వర్గకాముఁడు జ్యోతిష్టోమయాగము చేయవలెను.

సౌర్యంచరుం నిర్వపేద్బ్రహ్మవర్చసకామః = బ్రహ్మవర్చస కాముఁడు, సూర్యసంబంధమైన చరువును హోమము చేయవలెను, "చిత్రయాయజేత పశుకామః"=పశుకాముఁడు చిత్ర యను ఇష్టిచేయవలెను.

ఉపనిషద్వాక్యము:"బ్రహ్మవిదాప్నోతి పరం"=బ్రహ్మవిదుఁడు పరమును బ్రహ్మమును + మోక్షమును బొందుచున్నాఁడు.

"తదేషాఽభ్యుక్తా సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" = ఆ బ్రహ్మము, సత్యము, జ్ఞానము, అనంతమునై యుండునది.

క. అమృతమయ ఋగ్యజుస్సా
మముల యుపనిషద్వచస్స మాజములకు వా
చ్యమ్మయిన పురుషోత్తముని
కృష్ణమురూపగు వాని భక్తి-గమ్యుఁ దలంతున్.

శ్లో. గృణంతి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు
చతుర్భి శ్చతురాత్మానం సత్వస్థం సాత్వతాం పతిం 28

టీ. యం = ఎవనిని, సత్యకర్మాణం = త్రికాలములందు ఏమార్పులేక నిల్చియుండుట అను కర్మగలవాఁడగుటచే సత్యకర్ముఁడనియు, సత్యేషు = అబాధితార్థములైన ఆక్షేపములకు గుఱిగానివై పరమార్థమును దెలుపునవియైన, సామసు = రథంతరాది సామములందును, (సామవేదమునందు) సత్యం= అబాధితుని (దోషరహితుని) గను, చతుర్భిః = వాసుదేవ + సంకర్షణ + ప్రద్యుమ్న + అనిరుద్ధులను నాలుగురూపములచే, చతుః+ఆత్మానం=క్రమముగ, బ్రహ్మ+జీవ+మనస్+ అహంకారములుగ నుండువానిగను, సత్వస్థం = సత్త్వగుణముతోఁ గూడిన చక్కని బుద్ధియందు అభివ్యక్తమగు వానిగను, సాత్వతాం + పతిం = సత్త్వగుణవిశిష్టులగు భక్తులకు ప్రభునిగను, గృణంతి = ధ్యానము చేయుచున్నారో.

తా. ఎదేవుని భక్తులు త్రికాలాబాధ్యుఁడగుట వలన సత్యకర్మునిగను, అబాధితములైన (నిర్దోషములైన) సామవేద వాక్యములందును, సత్యస్వరూపుఁడై (నిర్మలుఁడు దోషరహితుఁడై) ప్రకాశించుచు, వాసుదేవుఁడు సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుండను నాలుగురూపులతో, బ్రహ్మము, జీవుఁడు, మనస్సు అహంకారములను నాలుగురూపభేదములను బొంది సత్త్వగుణముతోఁ గూడిన భక్తుల బుద్ధియందు

అభివ్యక్తమగుచు, (ప్రకాశించుచు) సాత్త్వికులు సత్త్వగుణ విశిష్టులు, విష్ణుపారమ్యము నెఱింగి భక్తులైనవారికిఁ బ్రభువైనవానిఁగ ధ్యానించుచున్నారో.

శ్లో. యందివ్యైర్దేవమర్చంతి గుహ్యైః పరమనామభిః
యస్మిన్నిత్యం తపస్తప్తం యదంగేష్వనుతిష్ఠతి. 29

టీక. యం + దేవం = ఏ దేవుని, దివ్యైః = మిగుల నుత్తమములై, గుహ్యైః = రహస్యార్థముగలవై, పరమనామభిః = భగవంతుని మహిమను దెలుపు పవిత్రనామములచే, అర్చంతి = పూజించుచున్నారో (స్తుతించుచున్నారో), యస్మిన్ = ఏ దేవుని యందు, (ఏ దేవుని విషయమై ఏ దేవుని ప్రీతికై) నిత్యం = ఎడతెగక, (నిరంతరమనుట) తప్తం = అనుష్ఠించఁబడిన, (అతి నియమమునకు లోఁబడి కష్టపడి ఆచరించినదనుట) తపః = స్వధర్మనిర్వహణరూపమైన తపస్సు, యత్ + అంగేషు = అట్టి తపస్సు చేసినవారి చిత్తములందు, తిష్ఠతి = నిల్చియుండునో, ఈశ్వరప్రీతి కాచరించిన క్రియలన్నియు భక్తుల చిత్తములకు నైర్మల్యము గలిగించుచున్నవనుట.

తా. భక్తులు, ఏ దేవుని, ఉత్తమములై, రహస్యములైన భగవంతుని మహిమను బ్రకాశింపఁ జేయు నామముల చేతఁ బూజించుచున్నారో, వర్ణాశ్రమధర్మములఁ దప్పక నడుచుకొనుచు, వారు ప్రతినిత్యము తామాచరించు స్వధర్మానుష్ఠానము, భగవత్ప్రీతికొఱకుఁ జొప్పడునేని అనఁగా

వారు బ్రహ్మార్పణబుద్ధితో స్వధర్మమగు కర్మానుష్ఠానము నిష్కాములై యనుష్ఠింతురేని అధర్మరూపమగు తపస్సు పరమేశ్వరుని ప్రీత్యర్థమై యనుష్ఠింపఁ బడినది గావున అనుష్ఠాతలకు వారిచిత్తశుద్ధి గావించుటద్వారా వారిస్వార్థమేయగుచున్నది. భగవంతునికిఁ బ్రీతిగఁ జేసిన కర్మలు భగవంతునికిఁ గదా సుఖమును గలిగింపవలెను. అట్లుగాక చేసినవారికే ఆ ఫలము నెందుట అనునది. ఆశ్చర్యముగాదె.

శ్లో. సర్వాత్మా సర్వవి త్సర్వః సర్వజ్ఞ స్సర్వభావనః 30

సర్వాత్మా = ఎవఁడు సమస్త జీవులకు ఆత్మయై, సర్వవిత్ = సర్వమును (సృష్టిస్థితిలయాదులనుట) దెలిసినవాఁడో, సర్వః = అంతయుఁ దానై యున్నాఁడో, సర్వజ్ఞః=జీవుల ధర్మాధర్మముల నన్నింటి నెఱింగినవాఁడో, సర్వభావనః = సర్వవిధముల కర్మభక్తి జ్ఞానమార్గములచేఁ భావింపఁబడువాఁడో.

తా. ఎవ్వఁడీ చరాచర జగత్తునఁగల యెల్ల దేహములందు జీవులకు నాత్మయై వెలుఁగువాఁడును, సకల బ్రహ్మాండగోళములందు జరిగినది, జరుగుచుండునది, జరుగఁబోవునదియు, సృష్టిస్థితిలయముల స్థితిగతుల సామాన్యముగ నెఱుంగు వాఁడును, ప్రపంచమంతయుఁ దానైనవాఁడును, సకలజీవుల ధర్మాధర్మములను, వారి శోకపోకలను, వారికి లభించు స్వర్గనరకములను, మోక్షమును, ఆదిమధ్యాంత వర్త

నములను విశేషించి సంపూర్ణముగ నెఱుంగు వాఁడును కర్మ భక్తిజ్ఞాన మార్గముల నన్నింటిచేతను భావింపఁబడువాఁడు నైనవానిఁ గొలుచుచున్నాను. అని అన్వయము.

శ్లో. యం దేవం దేవకీదేవీ వసుదేవా దజీజనత్
భూమేశ్చ బ్రహ్మణో గుప్త్యై దీప్త మగ్ని మివారణిః. 31

టీక. యం + దేవం = ఏ దేవుని, దేవకీదేవీ = దేవకీదేవి, వసుదేవాత్ = వసుదేవు నంశమున, అరణిః = క్రతువులందు అగ్నిఁబుట్టించు అత్తిఁజోనగు కొయ్య, దీప్తం + అగ్నిమివ = జ్వలించు నగ్నివలె, భూమేః = భూమియొక్క, బ్రహ్మణః = వేదము తత్సంబంధమైన బ్రాహ్మణులయు యజ్ఞాదులయు, గుప్త్యై = రక్షణముకొఱకు, అజీజనత్ = కనినదో, అరణి = క్రతువులోనద్చువారు అత్తికొయ్యలు రెంకు దెచ్చి క్రింది దానికిఁ దొలిచేసి పై దానికి మొనచేసి చిలికి అగ్నిఁ బుట్టించునది.

తా. భూజగత్తునందలి వేదరక్షణమునకు బ్రాహ్మణుల యజ్ఞయాగాదుల రక్షణముకొఱకును ఏ దేవుఁ డరణియందుఁ బ్రజ్వలించుచు నగ్నిజనించినట్లు దేవకీదేవి గర్భవాసమున వసుదేవునంశమున జన్మించినాఁడో. (వాని స్తుతింతుననుట)

ఆ. వె. అరణి నగ్ని వొడము కరణి దేవకియందు
విప్ర కర్మయజ్ఞ వేదగుప్తి
కై జనించె నెవ్వఁ డవ్వసుదేవ నం
దను భజింతు నేక తాసిరూఢి. గీ

శ్లో. య మనన్యో వ్యపేతాశీ రాత్మానం వీతకల్మషమ్
దృష్ట్వానంత్యాయ గోవిందం పశ్యత్యాత్మాన మాత్మని. 32

టీక. అనన్యః = తనకును బ్రహ్మమునకు భేదము లేదని యెఱింగిన యే భక్తుఁడు, లేక విష్ణువుకంటె నితర దేవత లెవ్వ రెక్కుడువారు లేరని తెలిసికొన్నవాఁడై, లేక సర్వప్రపంచము బ్రహ్మముకంటె వేరుగాదని యెఱింగినవాఁడై వ్యపేతాశీః = సర్వకామములను బోగొట్టుకొన్నవాఁడై, యం = ఏ, ఆత్మానం = ప్రపంచమున కంతటికి నధిష్ఠానమై, మూల కారణమై పరమాత్మయై, వీతకల్మషం = అవిద్యాది దోషము లేవియు లేకయుండు, గోవిందం = మహావిష్ణువును, ఆత్మని = తన హృదయము, లేక హార్దాకాశమందు, దృష్ట్వా = సూక్ష్మ బుద్ధిచే, (సూక్ష్మదృష్టిచే ననుట) ఆత్మానం = జీవులకెల్ల నాత్మ స్వరూపుఁడైన యా సర్వేశ్వరుని, ఆనంత్యాయ = మోక్ష ముకొఱకు, పశ్యతి = చూచుచున్నాఁడో.

తా. ఎవఁడీ ప్రపంచము బ్రహ్మమునకంటె వేరుగా దనియు తనకు (జీవునికి) బ్రహ్మమునకు భేదము లేదనియు, బ్రహ్మమగు విష్ణువే తనకు శరణ్యమనియు నెఱింగి దారేషణ, ధనేషణ, పుత్రేషణ, లోనగు సర్వకామములను వీడుకొన్న వాఁడై ప్రపంచమునకు మూలకారణమై నిష్కల్మషుఁడైన గోవిందుని హార్దాకాశమునందు ఆ సర్వేశ్వరుని తనకు (జీవునికి) (అన్ని జీవులకు) ఆత్మభూతునిగ సూక్ష్మబుద్ధితో మోక్షము వడయుటకై చూచుచున్నాఁడో.

(అనఁగా జననమరణ ప్రవాహరూపమునుంచి విడివడుటకై)

శ్లో. అతి వాయ్వింద్రకర్మాణ మతిసూర్యాతి తేజసమ్ ।
అతిబుద్ధీంద్రియాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్॥ 33

టీక. అతి + వాయు + ఇంద్ర + కర్మాణం = సర్వజీవులకుఁ బ్రాణమై సదా వీచువా యువుకంటెను ముల్లోకముల శాసించు నింద్రునికంటెను వారొనర్చు క్రియలకంటెనుమించిన క్రియలఁ జేయువాఁడును, అతి సూర్యాగ్ని తేజసమ్ = సూర్యుని కంటెను, అగ్నికంటెను తేజమున మిగిలి తేజరిల్లు వాఁడును, అతిబుద్ధి + ఇంద్రియ + ఆత్మానం = బుద్ధిని, ఇంద్రియములను, జీవుని అతిక్రమించి యుండువాఁడునైన, ప్రజాపతిః = ప్రాణి కోటులకెల్లఁ బ్రభువైన, తం = ఆ మహావిష్ణువును (శ్రీకృష్ణుని) ప్రపద్యే = శరణు పొందుదును.

తా. సర్వజగములకు జీవనాధారమై వెలుపలను, సర్వ జీవులకు నాధారమై ప్రాణరూపమున లోపలను, వర్తించు వాయువు చేయు కర్మకంటెను, త్రిలోకములకుఁ బ్రభునై ప్రజల నెల్ల శాసించుచు వజ్రాయుధమును జేపట్టిన ఇంద్రుఁడు చేయు కార్యములన్నింటికంటెను, అధికమైన సృష్టిలోనగు కర్మలను గావించువాఁడై వీరికిఁగూడ నాధారభూతుఁడై యుండు వాఁడును, సూర్యుని తేజమును మించిన తేజస్సుగలిగి వారిని గూడఁ బ్రకాశింపఁ జేయువాఁడును, బుద్ధీంద్రియజీవుల కందని వాఁడై వారిని బ్రవర్తింపఁజేయువాఁడును, జగములందు జనించిన దేవదానవమానవాదులకును, పశుపక్షి క్రిమికీటకా దులకును వృక్షాదులకును బ్రభువైన యా శ్రీకృష్ణుని శరణుపొందెదను.

శ్లో. పురాణే పురుషంప్రోక్తం బ్రహ్మప్రోక్తం యుగాదిషు
క్షయే సంకర్షణంప్రోక్తం తముపాస్య ముపాస్మహే. 34

టీక. పురాణే = అతీతములైన గడచిపోయిన కల్పముల యందు, పురుషం = సృష్ట్యాది ధర్మములనన్నింటిని దనలో నిముడ్చుకొని పూర్ణుఁడై యున్నందున పురుషుఁడని, ప్రోక్తం= చెప్పఁబడువాఁడును, యుగ + ఆదిషు = సృష్టికిఁ బ్రారంభ కాలములందు, బ్రహ్మ = కారణరూపమైన, సూక్ష్మరూప మైన సర్వప్రాణులయు, జగములయు, సృష్టిని స్థూలముగ విస్తరింపఁజేయుట వలన బ్రహ్మయని, ప్రోక్తం = చెప్పఁబడు వాఁడును, క్షయే = జగముల సంహారకాలమునందు (ప్రళయ కాలమునందు), సంకర్షణం = జగముల నెల్ల నాకర్షించుట వలన సంకర్షణుఁడనియు, ప్రోక్తం = చెప్పఁబడు, ఉపాస్యం = ఎల్లరచే నుపాసింపఁ దగినట్టి, తం = ఆ మహావిష్ణువును (శ్రీకృష్ణుని) ప్రపద్యే = శరణు పొందెదను.

తా. జరిగిపోయిన కల్పములందుండు సృష్ట్యాది సర్వ ధర్మమును బీజరూపమున, లేక కారణరూపమునఁ దనలో నిముడ్చుకొని దానికంటెకయుండుచుఁ బూర్ణుఁడై యుండుట వలనఁ బురుషుఁడను పేరుపొందిన వాఁడును, యుగములు ప్రారంభమగునప్పుడు (సృష్టి ప్రారంభమందనుట) అన్నింటి కంటె గొప్పవాఁడై యుండుచు, సూక్ష్మరూపమున నున్న సృష్టిని జీవసముదాయమును జగములను స్థూలముగ విస్త

రింపఁ జేయువాఁడగుటవలన బ్రహ్మము, లేక బ్రహ్మ యసియు, జగముల సంహారకాలమునందు (ప్రళయమందనుట) సర్వము నాకర్షించువాఁడగుట సంకర్షణుఁడనియుఁ బేరులొంది సర్వజనుల కుపాసింపఁ దగినవాఁడైన యీ మహావిష్ణువును శరణు పొందుచున్నాను.

శ్లో. యమేకం బహుధాత్మానం ప్రాదుర్భూత మధోక్షజమ్।
నాన్యభక్తాః క్రియావంతో యజంతే సర్వకామదమ్॥ 35

టీక. యం = ఏ దేవుని, ఏకం = మొట్టమొదటనొక్కఁడే యైయుండువానిగను, బహుధా + ఆత్మానం = (తర్వాత) పెక్కురూపముల, ఇంద్రాగ్న్యాది దేవతారూపములను, ప్రాదుర్భూతం = ఆవిర్భవించు (పుట్టు) వానిగను, అధోక్షజం = ఇంద్రియముల నధఃకరించి (క్రిందుచేసి) ప్రకాశించువాఁడును, లేక ఇంద్రియముల నధఃకరించిన వారికి సాక్షాత్కరించువాఁడును, (అని నిర్ణయించి) న + అన్యభక్తాః = ఇతరుల దేవతల నెవ్వరినుపాసింపక ఈ విష్ణుదేవునందే భక్తిగల భక్తులు, క్రియావంతః = పంచమహాయజ్ఞములు, జ్యోతిష్టోమాది యాగములు, ఇష్టాపూర్త దత్తములు, ఉపాసనాదులు అనుకర్మలు గలవారై, సర్వకామదం = ధర్మార్థకామ మోక్షములను వానినన్నింటి నొసఁగువాఁడైన మహావిష్ణువునుగూర్చి, యజంతే = యాగాదుల యజించుచున్నారో, ఉపాసించుచున్నారో.

తా. సృష్టికిఁ బూర్వము తానొక్కఁడే యుండుచు నవ్వల నింద్రాగ్న్యాదిరూపములఁ బెక్కుగఁ (ప్రపంచరూప

మున) నావిర్భవించు (పుట్టు) (ప్రకాశించు = భాసించు) వాఁడును, ఇంద్రియాతీతుఁడై వెలుఁగు వాఁడును, లేక జితేంద్రియులకుఁ బ్రత్యక్షమగు వాఁడును, (కల్మషవంతములగు నింద్రియములకుఁ గన్పట్టని వాఁడనుట) నగు నట్టి దేవుని అనన్యభక్తులు (ఇతర దేవత లెవ్వరిని భజింపక కేవలము విష్ణువునే భజించు వారు.) తా మొనర్చు నిత్య, నైమిత్తిక, కామ్యముల నన్నింటిని సర్వమనోరథముల నొసంగువాఁడైన యా విష్ణునిఁ గూర్చి చేయుచున్నారో, మఱియు నా విష్ణువునే యుపాసించుచున్నారో.

శ్లో. యమాహు ర్జగతః కోశం యస్మిన్ సన్నిహితాః ప్రజాః
యస్మిన్ లోకాః స్ఫురంతీ మే జలే శకునయో యథా. 36

టీక. యం = ఎవనిని, జగతః = జగమునకు, కోశం = మూలస్థానముగాఁ (కోశమనఁగా కత్తియొర, పట్టుపురుగుగూడు, ధనముంచు పేటిక, లేక బొక్కసము ఇవి యెట్లు ఆ వస్తువులఁ దమలో నిముడ్చుకొనుచున్నవో అట్లే జగమును తనలో నిముడ్చుకొని యున్న వాఁడనుట) యస్మిన్ = ఎవనియందు ప్రజాః=జనులు, సన్నిహితాః=ఆశ్రితులై యుందురో, యస్మిన్= ఎవనియందు, ఇమే = ఈ, లోకాః = జగములు, జలే = నీటి యందు, శకునయః = హంసకారండవాది పక్షులు, యథా = ఏ ప్రకారమో, స్ఫురంతి = ఆ ప్రకారము ప్రకాశించుచున్నవో.

తా. ఏ దేవు నీజగమునకుఁ గోశముగఁ జెప్పుచున్నారో ఖడ్గమునకు ఒర, పట్టుపురుగునకు గూడు, ధనమునకు బొక్కసము. ఎట్లు స్థానములైనవో అట్లు. ఎవ్వని నాశ్రయించుకొని ప్రజలెల్లరున్నారో, జలాశయములందు మునిఁగి పైకిఁ గానరాకయుండు హంసలు, నీటికాకులు లోనగు నీటి పక్షులు. జలోపరిభాగమునఁ గన్పట్టునట్లు ఈ లోకములన్నియు నెవ్వనియందు స్ఫురించుచున్నవో తోఁచుచున్నవో.

జగములు లేక ప్రజలు సృష్టికిఁ బూర్వమును, సృష్టియగుటయు, స్థితికాలమునందు లయమగుటయు అను వీనికన్నింటి కాధారభూతుఁడా దేవుఁడేయనుట జగములా దేవుని వలనఁబుట్టి ఆ దేవునాశ్రయించి స్థితిఁ గాంచి ఆ దేవునంద లయ మొందుచున్నవని భావము.

శ్లో. ఋత మేకాక్షరం బ్రహ్మ యత్తత్సదసతోః పరమ్
అనాది మధ్యపర్యంతం నదేవా నర్షయోవిదుః. 37

టీక. యత్ =ఏది, ఋతం=సత్యమై, ఏక+అక్షరం = కేవల మొక్కటేయై నాశరహితమై, లేక ప్రణవమే యుపాస్యమైన యక్షరముగలదై, సత్ + అసతోః = కారణకార్యముల కంటె మాయాజగత్తులకంటె, పరం = ఇతరమైనదో, అనాది మధ్యపర్యంతం = మొదలు, నడుము, తుద, అనున దేదియు లేకుండునట్టి, తత్ + అ, బ్రహ్మ = బ్రహ్మమును, దేవా+న విదుః = దేవతలెఱుంగరు, న + ఋషయః + విదుః = ఋషులు గుర్తెఱుంగరో.

తా. ఏది సత్యస్వరూపమై ఏకమై (తనకంటె నితరములేనిదై) అక్షరమై (నాశరహితమై) ప్రణవప్రతీకమై, (ఓంకారమగు నక్షరముచే నుపాసింపఁదగినదనుట) క్షరమనఁగా నశించునది అట్లుగానిది యక్షరము నాశరహితమైనది యక్షరము. అ, ఆ, క, ఖ, లోనగు వర్ణసమామ్నాయముఁ జెప్పినను అట్టివానిలో నోంకారమొక్కటే ఏకాక్షరమును జెప్పుట యేలయన బ్రహ్మమా యోంకారరూపమున స్ఫురించునదనియు, అట్టి ఓంకారముతో ధ్యానింపఁదగినదనియు, ఓంకారమే సర్వవర్ణములకు (అక్షరములకు) మూలకారణమనియుఁ దెలియుటకు. మఱియేది. నామ,రూప, క్రియాత్మకమై కార్యరూపమై భేదముగాఁ గన్పట్టు జగత్తు కంటెను, పై జాతి, గుణ, ద్రవ్య, క్రియలను దెలివిడికి నెడమీాయనిదై అవ్యాకృతము, అవ్యక్తము అని ప్రసిద్ధమై, యనిర్వాచ్యమై (ఇది యిట్టిదని చెప్పుటకు శక్యముగానిదియు, ఉన్నదని కాని లేదని కాని చెప్పుటకు వీలుకానిదియనియర్థము) జగములకు సామాన్యకారణమైన మాయకంటెను బరమై (భిన్నమై, వేఱై) దీనికిది మొదలు, ఇది నడుము, ఇది కొనయని తెలియుటకు వీలుగానిదియు (సర్వపరిపూర్ణమైనదనుట) తత్పద లక్ష్యార్థమగు నా బ్రహ్మమును దేవతలుగాని బ్రహ్మర్షులుగాని సామాన్యముగ గుర్తెఱుంగలేరో. ఆ బ్రహ్మమును శరణుపొందెదనని పైకి అన్వయము.

శ్లో. యం సురాసురగంధర్వాః సిద్ధా ఋషిమహోరగాః
ప్రయతా నిత్యమర్చంతి పరమం దుఃఖభేషజమ్. 38

టీక. యం = ఏ దేవుని, సురాసురగంధర్వాః = సురలు, అసురులు, గంధర్వులు, సిద్ధాః = సిద్ధులు, ఋషిమహోరగాః= ఋషులు, దొడ్డ పన్నగులు, ప్రయతాః = అత్యంతము నియమము గలవారై, దుఃఖభేషజమ్ = దుఃఖరూపమైన సంసార వ్యాధికి ఔషధమై, పరమం = అత్యంతముత్తమమైన, నిత్యం = ఎల్లప్పుడు లేక శాశ్వతుఁడైన దేవునిఁగ, అర్చంతి = పూజించుచున్నారో.

తా. సురలు, అసురులు, గంధర్వులు, సిద్ధులు, గొప్పవారగు పన్నగులు నియతాత్ములై (ఇంద్రియములు వశ్యములు గావించి చిత్తమేకాగ్రము చేసికొని) ఆధ్యాత్మిక + ఆధిభౌతిక + ఆధిదైవికములను త్రివిధదుఃఖములకు నాస్పదమైన సంసారమనెడు వ్యాధికి ఉత్తమౌషధమైన యా పరమాత్ముని నిత్య మర్చించుచున్నారు.

శ్లో. అనాదినిధనం దేవ మాత్మయోనిం సనాతనమ్
అప్రేక్ష్య మనభిజ్ఞేయం హరిం నారాయణం ప్రభుమ్. 39

టీక. అనాదినిధనం = ఆదియనఁగా మొదలు, అనఁగా జన్మము నిధనమనఁగా మరణము ఇవి రెండును (జనన మరణములు) లేనివాఁడును, దేవం=స్వయంప్రకాశ స్వరూపుఁడును, ఆత్మయోనిం = శరీరేంద్రియాదుల నధిష్ఠించిన జీవాత్మలకు

ఉత్పత్తిస్థానమైనవాఁడును, సనాతనమ్ = తనకంటె ముందే దియు లేనివాఁడగుట పురాణపురుషుఁడని చెప్పఁదగిన ప్రాచీనతముఁడును, అప్రేత్యం = జ్ఞానేంద్రియములచేఁ దెలియరానివాఁడును, అనభిజ్ఞేయం = మనోబుద్ధులకుఁగల్మషవంతములైన వానికిమాత్రమే) గుర్తెఱుంగరానివాఁడును, హరిం, నారాయణం=హరి, నారాయణుఁడను నామముల నొప్పువాఁడునగు, ప్రభుం = నిగ్రహానుగ్రహ సమర్థుఁడైన వానిని (సేవింతును.)

తా. నిధనమనఁగా మరణము, అది మొదట గలవాఁడు (అనఁగా జన్మముగలవానికి గదా మరణము గలుగును అట్టి వాఁడు) ఆదినిధనుఁడు. ఆదినిధనుఁడు కానివాఁడు అనాది నిధనుఁడు, జన్మమరణములు లేనివాఁడని భావము. స్వయంప్రకాశుఁడై జగల్లీలచేఁ గ్రీడించువాఁడును, జయశీలుఁడునగుట దేవుఁడని చెప్పఁదగినవాఁడును, జీవులకందఱకు నుత్పత్తి స్థానమగుటనాత్మయోని, ప్రాచీనతముఁడు అనఁగా ఆయనకు ముందున్నది ఏదియు లేదు. కావున పురాణపురుషుఁడు, సనాతనుఁడు అని చెప్పఁబడువాఁడును, ముందుచెప్పినట్లు ఇంద్రియ వర్గమునకుఁ గానరానివాఁడును, సామాన్యముగఁ గరస్థామలకమునటె (చేతియందలి యుసిరిక కాయవలెఁ) దెలిసికోఁదగుటకు సాధ్యముకానివాఁడును, (కలుషితములైన మనోబుద్ధులకు అందరానివాఁ డనియుఁ దెలియవలెను). హరి, నారాయణుఁడని కీర్తింపఁదగువాఁడును, నిగ్రహానుగ్రహ సమర్థుఁడగుట ప్రభుశబ్దవాచ్యుఁడైతగునామహావిష్ణువును సేవించెదను.

పాఠాంతరము

అవితర్క్యం = ఊహింప నలవికానివాఁడును
అవిజ్ఞేయం = తెలిసికొన సులభుఁడు గానివాఁడు

అగువానిని. అనియర్థము

శ్లో. యంవై విశ్వస్యకర్తారం జగత స్తస్థుషాంపతిమ్
వదంతి జగతోఽధ్యక్ష మక్షరం పరమంపదమ్. 40

టీక. యం+వై=ఎవనినైతే, విశ్వస్య=జగమునకు (సమస్త మునకు) కర్తారం=కర్తఁగను, (సృజించువానిఁగ ననుట,) జగతః=లోకమునకు. తస్థుషాం=స్థిరముగఁ బ్రళయకాలము వఱకు నిల్చియుండువానికి, పతిం=ప్రభునిగను, జగతః=లోకమునకు, అధ్యక్షం=అధిపతిగను, అక్షరం=నాశరహితుని గను, పరమం=అత్యుత్తమమైన, నిత్యమైన, పదం=స్థానముగను, వదంతి=చెప్పుచున్నారో.

తా. ఎవ్వఁడు విశ్వమును సృజించుకర్తయై జగమునందు స్థిరమైనవానికిఁ బ్రభువై, పాలకుఁడై, జగమున కధిపతియై, సాక్షీభూతుఁడై, జగము సంహరించి తనయందుంచుకొను నక్షరస్వరూపుఁడై, (ఏ వస్తువును శాశ్వతముగా నుండునది కాదు, కొండలు చెడ్డ, కొన్నాళ్లకుఁ గోనలు చెడునన్నట్లు ముందు వెనుకలను కాలభేదముదప్ప మొత్తముమీద నీకనంబడు జగమును, ఇందుఁగల సర్వభూతములును లయముగాంచునవే, ఇవన్నియు నాశమైనను ఆ పరాత్పరుఁ డొక్కఁడే నిల్చి

యుండునని భావము.) యున్నాఁడో ఆ పరమపదమైన మోక్ష ధామమై, అఖండానంద స్వరూపమైనవానిఁ దలఁతును.

1. సూర్యుఁడు

శ్లో. హిరణ్యవర్ణం యంగర్భ మదితి ర్దైత్యనాశనమ్
ఏకం ద్వాదశధా జజ్ఞే తస్మై సూర్యాత్మనే నమః. 41

టీక. అదితిః = కశ్యప ప్రజాపతి భార్యయైన అదితిదేవి, యం = ఎవనిని, హిరణ్యవర్ణం = బంగారు వన్నెగలిగి, దైత్య నాశనమ్ = దితిదేవి సంతానమైన రాక్షసులను నాశముచేయు నట్టియు, ఏకం = ఒక్కఁడే అయినవానిని, ద్వాదశధా = పండ్రెండురూపులు గలవానినిగా, జజ్ఞే = కనేనో, సూర్యాత్మనే = సూర్యస్వరూపుఁడగు, తస్మై = ఆ మహా విష్ణువునకు నమః = నమస్కారము.

తా. అదితిదేవి కశ్యప ప్రజాపతిభార్య, కశ్యపుఁడు నవబ్రహ్మలలో నొకఁడు. వీరెల్లరు బ్రహ్మదేవుని పుత్రులు. మఱివీరు బ్రహ్మయనుజ్ఞచే ప్రపంచసృష్టికిఁ దోడ్పడి ప్రజా సంతతుల సృష్టించి పెంచిరి. వారిలోఁ గశ్యపమహర్షికి పద ముగ్గురు భార్యలుగలరు. అదితి, దితి, దనువు, కద్రువ, వినత లోనగువారు. వారిలో నదితిదేవికి జనించినవారు దేవతలు కావుననే వీరాదిత్యులనఁ బరఁగిరి. ఈమె గర్భవాసమునందే స్వర్ణచ్ఛాయతో దైత్యుల సంహారము చేయుటకై ఒక్కఁ

డయ్యు పండ్రెండు మూర్తులుగానెవఁడుజన్మించి దైత్యులనెల్ల నాశము చేయుచున్నాఁడో సూర్యస్వరూపుఁడైన ఆ శ్రీ మహా విష్ణువునకు నమస్కారము :-

ద్వాదశాదిత్యులు. ఒక్కసూర్యుఁడు పండ్రెండు పేరులతో పండ్రెండు రూపములొంది, చైత్రము, వైశాఖము లోనగు పండ్రెండు మాసములందు ఒక్కొక్క సూర్యుఁడుగా లోకమును పాలించును. వెలుఁగు, వేడిమి, వర్షమునిచ్చి ప్రాణులఁ బోషించువాఁడని భావము. చైత్రమాసమున ధాత, వైశాఖ మాసమున అర్యముఁడు, జ్యేష్ఠమున మిత్రుఁడు, ఆషాఢమున వరుణుఁడు, శ్రావణమున ఇంద్రుఁడు, భాద్రపదమున వివస్వంతుఁడు, ఆశ్వయుజమున త్వష్ట, కార్తీకమున విష్ణువు, మార్గశిరమున తర్యముఁడు, పుష్యమున భగుఁడు, మాఘమున పూషుఁడు, ఫాల్గుణమున క్రతువు, అనుపేరుల నొప్పుచున్నాఁడు.

అదితి విష్ణునారాధించి సూర్యునిగనెను. అతఁడు తొల్త నండ రూపముననుండి అదితిచేయు నుపవాసములకు అవిసి జనించిన వాఁడు గావున మార్తాండుఁడనఁ బరఁగెను,

తే. గీ. ఒకఁడు పండ్రెండుమూర్తులై యుండునట్లు
గా హిరణ్యవర్ణంబగు గర్భ మదితి
దాల్చి యెవ్వానిఁ గనియె దైత్యఘ్నునట్టి
దేవు సూర్యాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు. 6

2. చంద్రుఁడు

శ్లో. శుక్లేదేవాన్ పితౄన్ కృష్ణే తర్పయ త్యమృతేన యః
యశ్చ రాజా ద్విజాతీనాం తస్మై సోమాత్మనే నమః. 42

టీక. యః = ఎవఁడు, శుక్లే = శుక్లపక్షమందు, దేవాన్ = దేవతలను, కృష్ణే = కృష్ణపక్షమందు, పితౄన్ = పితృదేవతలను, అమృతేన = తనలోని యమృతముచే, తర్పయతి = తృప్తిపఱచుచున్నాఁడో, యః = ఏ దేవుఁడు, ద్విజాతీనాం = బ్రాహ్మణులకు, రాజా = ప్రభువై యున్నాఁడో, సోమాత్మనే = సోమస్వరూపుఁడైన (చంద్రుఁడనుట) తస్మై = ఆ విష్ణుదేవునకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు చైత్రాది మాసములందు శుక్లపక్షమున వృద్ధిపొందుచు, దేవతలను, కృష్ణపక్షమున క్షయమొందుచు బితృదేవతలను దనలోని యమృతధారలనొసంగి తృప్తిగావించుచున్నాఁడో. ఏ దేవుఁడు బ్రాహ్మణులకు బ్రభువై యున్నాఁడో. (అనఁగా కర్మఠులగు బ్రాహ్మణులు జ్యోతిష్టోమాది యాగములుగావించి మరణించిన పిదప చంద్రమండలమున కేఁగి అచ్చట దేవభోగముల స్వర్గసౌఖ్యముల ననుభవింతురు. కావున తద్ద్వారా బ్రాహ్మణులకుఁ జంద్రుఁడు ప్రభువగు చున్నాఁడు.) అట్టి సోమస్వరూపుఁడైన (చంద్రుఁడైన) ఆ మహావిష్ణువునకు నమస్కారము (విష్ణువే చంద్రుఁడై యున్నాడనుట, లేక చంద్రునందు అంతర్యామి స్వరూపమున నున్నాడనుట ఇట్లే అంతట నూహింపవలెను.

క. సురపితృకోట్లం బూర్వా
పర పక్షదినముల నమృత పాన ప్రీతిం
బొరయం జేయుచు వెలిగెఁడు
హరి సోమాత్మకుని, గొల్తు నాత్మేశ్వరునిన్. 7

౬. జ్ఞేయాత్మ

శ్లో. మహత స్తమసః పారే పురుషం హ్యతి తేజసమ్
యంజ్ఞాత్వా మృత్యుమత్యేతి తస్మై జ్ఞేయాత్మనే నమః. 43.

టీక. యః = ఎవఁడు, మహతః = మిగుల దొడ్డదైన, తమసఃపారే = అవిద్య, లేక అజ్ఞానమను నంధకారముయొక్క యావలిగట్టునందు, అతితేజసం = సూర్యచంద్రాగ్న్యాదుల కంటె మిగిలినట్టి తేజస్సుగలవాఁడునై, స్వయంజ్యోతియై ఉన్నాఁడో, యం = ఏ దేవుని, జ్ఞాత్వా = తెలిసికొని (ముముక్షువు) మృత్యుం = జననమరణ రూపమగు సంసారమను మృత్యువును, అత్యేతి = అతిక్రమించు (దాఁటు) చున్నాఁడో జ్ఞేయ+ఆత్మనే = తెలిసికోఁదగిన స్వరూపముగల, తస్మై = ఆ పరమాత్మునికి మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. మిగుల గొప్పదైన అజ్ఞానమను నంధకారమున కవ్వల నే పురుషోత్తముఁడు స్వయంజ్యోతియై యెక్కుడు. తేజఃపుంజమునఁ దనకుఁదాను ప్రకాశించుచున్నాఁడో, ఏ దేవు నెఱింగినవారు జననమరణ రూపమైన సంసారమను

మృత్యువు నతిక్రమించి పోవుచున్నారో, అట్టి తెలియనైన, తెలియవలసిన జ్ఞానస్వరూపుఁడై జ్ఞేయస్వరూపుఁడైన పర మాత్ముఁనకా మహావిష్ణువునకు నమస్కారము, జ్ఞేయాత్ముఁడై అనఁగా ముముక్షువులు. తమ హృదయాకాశమున వెలుంగు వాని చిత్తసమాధానముద్వారా తెలిసికోవలసిన జ్ఞానస్వరూ పుఁడే యగునుగాని ఉపాస్యుఁడు గాఁడు. అనగా సగుణరూప మున ధ్యాత, ధ్యాన, ధ్యేయ రూపమున నుపాసింపఁ దగనిది నిర్గుణ బ్రహ్మమనుట.

## 4. వేదము

శ్లో. యం బృహంతం బృహత్యుక్థే యమగ్నౌ యంమహాధ్వరే
యంవిప్రసంఘా గాయంతి తస్మై వేదాత్మనే నమః 44

టీక. విప్రసంఘాః = బ్రాహ్మణ సంఘములు, యం = ఏ, బృహంతం = దొడ్డవానిని, బృహతి = గొప్పదైన, ఉక్థే = ఉక్థ మను పేరుగల శస్త్రక్రియయందును, (స్తుతి) యం = ఎవనిని, అగ్నౌ = అగ్నిచయనమందును, యం = ఎవనిని, మహా ధ్వరే = గొప్ప యజ్ఞమునందును, గాయంతి = గానము చేయు చున్నారో, వేదాత్మనే = వేదస్వరూపుఁడగు, తస్మై = ఆ శ్రీ మహావిష్ణువునకు నమస్కారము.

తా, ఏ జగదీశ్వరునిగూర్చి బహ్వృచులు, హోతలు, ఋగ్వేదాధ్యయనము చేయువారు. ఉక్థమను శస్త్రక్రియ

యందు (స్తుతించుచు హోమముచేయ క్రియ శస్త్రము, ఉక్థ మనఁబడును) హోమము చేయుచున్నారో ఎవనినిగూర్చి అధ్వర్యులు యజుర్వేదాధ్యయనము చేయువారు. అగ్ని చయనమునందు ప్రేల్తురో, ఎవనినిగూర్చి దీర్ఘ సత్రయాగము నందు మహర్షులు హోమముచేయుచున్నారో. ఎవనినిగూర్చి ఉద్గాతలు సామవేదాధ్యయనము చేయువారు. సామగానము చేయుచున్నారో, వీరుచేయు క్రియలన్నింటికి ఆధారభూతమై యొప్పారు వేదస్వరూపుఁడైన ఆ మహావిష్ణువునకు నమస్కారము చేయుదును.

5. యజ్ఞము

శ్లో. ఋగ్యజుః సామధామానం దశార్ధం హవిరాత్మకమ్
యం సప్తతంతుం తన్వంతి తస్మై యజ్ఞాత్మనే నమః. 45

టీ. ఋక్ + యజుస్ + సామధామానం = ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. అను మూఁడు వేదములు ధామములు (నివసించు మేడలుగా) గలవాఁడును, దశ+అర్ధ= పదింటిలో సగమైన ఐదగు, హవిరాత్మకం = ధానములు, కరంభము, పరివాపము, పురోడాశము, పయస్యము. అను విధములగు హవిస్సుల స్వరూపము గలవాఁడునైన, యం = ఎవనిని. సప్తతంతుం = గాయత్రిలోనగు ఏడు ఛందస్సులుగల యజ్ఞస్వరూపునిగా, తన్వంతి = విస్తరించుచు (స్తుతించుచుఁ)

గర్మలు చేయుచున్నారో అనుట. యజ్ఞాత్మనే = యజ్ఞ స్వరూపుఁడగు, తస్మై = ఆ శ్రీ మహావిష్ణువునకు నమస్కారము.

తా. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అను వానిని తనకు నివసించు భవనములుగాఁ జేసికొన్న వాఁడును. యజ్ఞములందు హోమముచేయు, ద్రవ్యములైన ధానములు = గోధుమలు వేయించి చేసిన నూక, కరంభము = గోధుమలు వేయించి చేసినపిండి నేయి కలిపినది. పరివాపము= వడ్లబొరుగులు, పురోడాశము = గోధుమలపిండి నేతితో కలిపి చేసిన అప్పము. పయస్యము = పాలు, పెరుగు, నెయ్యి అని పేరులు పొందినవాని స్వరూపమునఁ బొల్చువాఁడును, (అది తానే యగువాఁడును,) గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు, జగతి, అను సప్తచ్ఛందస్సులతో గూడిన వానిగ (యజ్ఞస్వరూపునిగ) ఎవ్వాని విప్రసంఘములు స్తుతించి కర్మలు చేయుచున్నారో, యజ్ఞస్వరూపుఁడగు నా శ్రీ మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

6. హోమము

శ్లో. చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవచ.
హూయతేచ పునర్ద్వాభ్యాం తస్మై హోమాత్మనే నమః. 46

టీక. ఎవఁడు, యజ్ఞములందు, చతుర్భిః + చ = "ఆశ్రావయ" అను నాలుగక్షరములచేతను, చతుర్భిః + చ. అస్తు శ్రౌషట్. అను నాలుగక్షరములచేతను, ద్వాభ్యాం = యజ,

అను రెండక్షరములచేతను, పంచభిః + ఏవచ = యే యజా మహే అను నైదక్షరముల చేతను, పునః + ద్వాభ్యాం = మరల వషట్, అను రెండక్షరములచేతను, హూయతే = ఆహ్వానింపఁబడుచున్నాఁడో, హోమాత్మనే=హోమస్వరూపుఁడైన, తస్మై=ఆ శ్రీమన్నారాయణునకు, నమః=నమస్కారము.

తా. విప్రసంఘములు యజ్ఞములందు ఎవ్వని ఆశ్రావయ, అస్తుశ్రౌషట్, యజ, యేయజామహే, వషట్. అను పదునేడక్షరములుగల వాక్యములతో నాహ్వానించి హోమము చేయుచున్నారో. (4 + 4 + 2 + 5 + 2 = 17,) హోమస్వరూపుఁడై వెలుంగు నా శ్రీమన్నారాయణునకు నమస్కారము చేయుచున్నాను.

అనఁగాఁ బైనఁ జేర్కొన్న శబ్దముల నుచ్చరించుచు హోమము చేయుదురు. అవియన్నియు విష్ణు నాహ్వానము లనియుఁ దెలియవలెను.

7, స్తోత్రము.

శ్లో. య స్సుపర్ణో యజుర్నామ ఛందోగాత్ర స్త్రివృచ్ఛిరః
రథంతరం బృహత్సామ తస్మై స్తోత్రాత్మనే నమః. 47

టీక. యః = ఎవఁడు, సుపర్ణః = వేదపురుషుఁడో, యజుః + నామ = యజస్సు అని ఎవనికి నామమో, ఛందోగాత్రః=

పైనఁ బేర్కొన్న గాయత్రిలోనగు సప్తచ్ఛందస్సులు హస్తములు, పాదములులోనగు నవయవములో, త్రివృత్ + శిరః = ఋగ్యజుస్సామములను మూఁడువేదములతోఁగూడి వర్తించునది గావున త్రివృత్తు అని చెప్పఁబడునట్టిది యజ్ఞము. ఆ యజ్ఞ మెవనికి శిరమో, రథంతరం = అగ్ని నిర్మంథనాది క్రియలందు నుచ్చరించు శ్రుతివాక్యము, బృహత్ + సామ = బృహత్సామమను పేరుగలది. దొడ్డదైన ప్రీతివాక్యమో స్తోత్రాత్మనే = ఈ విధమగు స్తుతిగల స్తోత్రస్వరూపుఁడైన, తస్మై = ఆ శ్రీకృష్ణునకు, నమః = నమస్కారము.

సుపర్ణుఁడు = శ్రేష్ఠమైన తెక్కలు గలవాఁడని యర్థము. ఇచ్చట అతిబలవంతుఁడని అర్థము చెప్పవలెను. (గరుత్మంతునికిఁ బేరు.

తా. సుపర్ణుఁడైన యేవేదపురుషుడు యజుస్సను నామధేయము గలవాఁడో. గాయత్రి, ఉష్ణిక్కు అనుష్టుప్పు, త్రిష్టుప్పు, బృహతి, పంక్తి, జగతి, అను ఛందస్సు లెవనికి శరీరావయవములో, ఋగ్యజుస్సామములతో వర్తించు యజ్ఞమెవ్వానికి శిరమో, అగ్ని నిర్మంథనమను (అరణి మథించి అగ్ని పుట్టించుక్రియ) రథంతరమను పేరుగలిగి బృహత్సామము, అను పేరుగల సామవేదమునందలి వాక్యమెవ్వానికిఁ జాల ప్రీతికరమైన వాక్యమో స్తుతిరూపుఁడగు నా వైకుంఠునికి నమస్కారము చేయుచున్నాను.

౮. హంసుఁడు.

శ్లో. య స్సహస్రసమే సత్రే జజ్ఞే విశ్వసృజా మృషిః
హిరణ్యపక్ష శ్శకుని స్తస్మై హంసాత్మనే నమః. 48

టీక. యః = ఎవఁడు, విశ్వసృజాం=బ్రహ్మదేవుని పుత్రులై నవబ్రహ్మలని పేరువడి ప్రజాపతులనియుఁ బిలువఁబడు, పులస్త్యహులుఁడు కశ్యపుఁడు లోనగు ప్రపంచము సృజించువారియొక్క, సహస్రసమే = వేయి సంవత్సరముల కాలము గావించునదైన, సత్రే = సత్రయాగమునందు (యజమానుఁడుఁ ఋత్విజుఁడు నొక్కఁడే యై ఎవరికివారు హోమము చేయునది. వేలకొలఁదిమంది ఋషులు గలది. సత్రయాగ మనఁబడును.) జజ్ఞే = ఆవిర్భవించెనో, పుట్టెనో, (నవబ్రహ్మలలో నొక్కఁడైన కశ్యప ప్రజాపతికిఁ బుట్టెనో అనుట). ఋషిః = సర్వగతుఁడై, హిరణ పక్షః = బంగారు మయములైన ఱెక్కలుగలిగి, శకునిః = పక్షి స్వరూపుఁడై యుండునో, హంసాత్మనే = హంసస్వరూపుఁడైన (అన్నింటి నతిక్రమించి మీఁదుగఁ బ్రవర్తించువాఁడు. హంసుఁ డనఁబడును. ఇచ్చట రాజహంస కాదు.) గరుత్మంతుని స్వరూపుఁడైన యా విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

ఇచ్చట, ఋషిః = కశ్యపుఁడు, జజ్ఞే = కనెనో అనియు అర్థము చెప్పవచ్చును.

తా. ఏ జగత్ప్రభుఁడు, బ్రహ్మదేవుని పుత్రులై నవ బ్రహ్మలు ప్రజాపతులు. అని పేరువడి ప్రపంచముయొక్క

సృష్టిని విస్తరింపఁ జేయువారైన పులస్త్యుఁడు, కశ్యపుఁడు లోనగువారు చేయు వేయిసంవత్సరముల కాలము పరిమితి గల సత్రయాగమునందు కశ్యప ప్రజాపతికి జనించి బంగారు ఱెక్కలుగల పక్షియై సర్వముమించి వర్తించుటచే హంసుఁడను పేరుగలవాఁడై తార్క్ష్యస్వరూపుఁడైన (గరుత్మంతుని స్వరూపుఁడైన అనుట.) ఆ పరమేశ్వరునకు నమస్కారము చేయుచున్నాను.

తే. గీ. విశ్వ సృజులైన మునులచే వితతమగు స
హస్రవత్సర కలిత మహాధ్వరమునఁ
గశ్యప బ్రహ్మ యొవ్వానిఁగనియెఁ గనక
పక్షుఁ దార్క్ష్యాత్ముఁ దలఁతు నే పద్మనాభు. 8

9. వాక్య.

శ్లో. పాదాంగ సంధిపర్వాణం స్వరవ్యంజన భూషణమ్
యమాహు రక్షరందివ్యం తస్మై వాగాత్మనే నమః. 49

టీక. పాదాంగ – ణం, పాద = పదములయొక్క సమూహము లేక శ్లోకములందలి పాదములు పాదములుగను, అంగ = వాక్యములు, హస్తాదులగు నవయవములుగను, సంధి = సవర్ణదీర్ఘ సంధిలోనగు సంధులు. అంగుళులు. లేక వ్రేళ్లు మొదలగు వానియొక్క గణుపులుగను, గలవాఁడును, స్వర – ణం స్వర = అచ్చులు, వ్యంజన = హల్లులు, భూషణం =

ఆభరణములుగాఁ గలవాఁడునైన, యం = ఎవనిని, దివ్యం = అత్యుత్తమై, ప్రకాశించునదైన, అక్షరం = ఓంకారమను నక్షరస్వరూపునిగ, ఆహుః = చెప్పుదురో, వాగాత్మనే = వాక్స్వరూపుఁడైన, తస్మై = ఆ వాసుదేవునికి, నమః = నమస్కారము.

తా. ఎవనికి సంస్కృతాదిభాషల యందలి పదసమూహములు, పాదములో, వాక్యములవయవములో, సవర్ణసంధి, గుణసంధి లోనగు శబ్దశాస్త్రము లేక వ్యాకరణశాస్త్రము నందలి సంధులు, అంగుళుల పర్వములో (వ్రేళులగణుపులో) విజ్ఞులెవ్వని అత్యుత్తమై ప్రకాశించునదైన ఓంకారమను నక్షరస్వరూపునిగఁ (నాశరహితునిగ) జెప్పుదురో అట్టి వాక్స్వరూపుఁడైన వాసుదేవునికి నమస్కారము చేయుచున్నాను. (శబ్దబ్రహ్మమునకు) అనుట.

10. వీర్యము — యజ్ఞవరాహము

శ్లో. యజ్ఞాంగో యోవరాహోవై భూత్వా గాముజ్జహార హ
లోకత్రయ హితార్థాయ తస్మై వీర్యాత్మనేనమః. 50

టీక. యః = ఏ దేవుఁడు, యజ్ఞాంగః = వైదికములగు జ్యోతిష్టోమాదులగు యజ్ఞములే అవయవములుగాఁగల శరీరము గలవరాహః + వై = ఆదివరాహమై (సూకరమై), గాం = జలములందు మునిఁగి రసాతలగతమైన భూమిని, లోక

శ్రేయ హితార్థాయ = ముల్లోకముల శ్రేయముకొఱకు, ఉజ్జహార హ = పైకెత్తి నిల్పెనో, వీర్యాత్మనే=మహాబల స్వరూపుఁడగు, తస్మై = ఆ యాదివరాహమూర్తికి పరబ్రహ్మమునకు, నమః = నమస్కారము.

తా. ఏ దేవుఁడు యజ్ఞాదిక్రియలు నిల్చుటకుఁ గారణమైన (యజ్ఞములై అవయవములుగాఁ గలయనుట) ఆది వరాహమై సముద్ర జలములందు మునిఁగి రసాతలలోకమునఁ బడియుండిన భూమిని ముల్లోకములు శ్రేయము పొందుటకై లేవనెత్తి యథాస్థితిగ నిల్పినాఁడో, వీర్యస్వరూపుఁడై (మహాబల స్వరూపుఁడగు) నా యజ్ఞ వరాహమూర్తికిఁ బరబ్రహ్మమునకు నమస్కారము.

11. యోగనిద్ర — శేషశాయి

శ్లో. యశ్శేతే యోగమాస్థాయ పర్యంకే నాగభూషితే
ఫణా సహస్రరచితే తస్మై నిద్రాత్మనేనమః. 51

టీక. యః = ఏ పరమేశ్వరుఁడు, యోగం = స్వస్వరూపానందమను యోగమును, ఆస్థాయ = గ్రహించి లేక అట్టి యోగమునందు నిల్చి, నాగభూషితే = నాగరాజైన ఆదిశేషునిచే నలంకృతమైనదియు, ఫణాసహస్రరచితే = పడగల వేయింటిచే నిర్మితమైన (అనఁగా వేయిపడగలు పైనుండి ఆచ్ఛాదనమై (దోమతెరవలె నున్నవనుట) పర్యంకే = పాన్పు

నందు, శేతే = పవళించియున్నాఁడో, నిద్రాత్మనే = యోగ నిద్రా స్వరూపుఁడగు, తస్మై = ఆ శ్రీమన్నారాణమూర్తికి నమస్కారము.

తా. ఏ భగవంతుఁడు నాగరాజగు నాదిశేషుఁడు మృదువైన పడకయై పైనఁ దనవేయిపడగలను దోమ తెరవలె నాచ్ఛాదము చేసియుండఁగా నట్టి యలంకృతమైన శయ్యయందుఁ బవళించి ఆత్మానందమైన యోగ మనుష్ఠించి యున్నాఁడో, యోగనిద్రా స్వరూపుఁడైన ఆ శేషశాయికి శ్రీమన్నారాయణమూర్తికి నమస్కారము చేయుచున్నాను.

12. సత్యము.

శ్లో. యస్తనోతి సతాం సేతు మృతేనామృతయోనినా
ధర్మార్థ వ్యవహారాంగై స్తస్మై సత్యాత్మనే నమః. 52

టీక. యః = ఏ పరమేశ్వరుఁడు, సతాం = సత్పురుషులకు సేతుం = భరించు నుపాయమైన (ఉద్ధరించునట్టి) యోగధర్మ మను సేతువును, (వంతెనను) అమృతయోనినా = మోక్షము నకు హేతువైన, ఋతేన = వేదోక్తమైన ఉపాయముచేతను, ధర్మార్థ + వ్యవహార + అంగైః = కేవలము ధర్మముకొఱకే వ్యవహరించు రాగాదులగు నింద్రియములచేతను, తనోతి = విస్తరింపఁ జేయుచున్నాఁడో సత్యాత్మనే=సత్యస్వరూపుఁడగు, తస్మై = ఆ పరబ్రహ్మమునకు నమస్కారము.

తా. ఏ పరమేశ్వరుఁడు మోక్షమునకు హేతువై వేదోక్తమై సత్యమగు యోగధర్మమును జ్ఞానయోగమును

సత్పురుషులను సంసారసాగరమునుండి దాటించుటకు సేతు వైన (వంతెన) దానిని కేవలము ధర్మముకొఱకు వ్యవహరించు నట్టి జితములైన (శబ్దాదివిషయ సుఖముల జయించిన వైన) ఇంద్రియములచేత జగమునందు విస్తరింపఁజేసినాఁడో, వేద ముల ద్వారా లోకమునకు శ్రేయోమార్గము చూపినాఁడో, సత్యస్వరూపుఁడగు నా మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

## 13. ధర్మము

శ్లో. యం పృథగ్ధర్మచరణాః పృథగ్ధర్మ ఫలైషిణః
పృథగ్ధర్మైః సమర్చంతి తస్మై ధర్మాత్మనే నమః. 53

టీక. యం = ఎవనిని, పృథక్ + ధర్మ + చరణాః = భిన్న భిన్నములైన పాశుపతము, పాంచరాత్రము, గాణపతము, శాక్తము, సౌరము, కాపాలికము లోనగు తంత్రములందుఁ జెప్పఁబడిన ధర్మములను ఆచరించువారును, పృథక్ + ధర్మ ఫల + ఏషిణః = భిన్నభిన్నములగు పుత్ర, పశు, విత్త, స్వర్గ, సౌఖ్యాదులను గోరువారును, పృథక్ + ధర్మైః = జపము, హోమము, పూజ, తపము, లోనగు భిన్నమార్గములచేత సమర్చంతి = పూజించుచున్నారో, ధర్మాత్మనే = ధర్మస్వరూపుఁ డగు, తస్మై = ఆ మహావిష్ణువునకు నమః = నమస్కారము.

తా. ఏ మహనీయుని భిన్నభిన్నములగు పాశుపత, పాంచరాత్ర, గాణపత, సౌర, శాక్త, కాపాలికాది తంత్రము

లందుఁ జెప్పఁబడు ధర్మముల నాచరించువారు. (ఆయా మతాను యాయులనుట) భిన్నభిన్నములగు ఫలములను, పుత్ర, పశు, విత్త, స్వర్గములను, ఆరోగ్యాయుర్దాయ, శత్రు సంహారములు లోనగు నైహికాముష్మికములగు ఫలములను గోరువారు భిన్నభిన్నములగు జప తపములు వ్రతదాన ధర్మములు హోమబలితర్పణములు, పూజలు ఇష్టాపూర్త దత్తములు. ఉపవాసములు లోనగు మార్గములచేఁ బూజించుచున్నారో, ధర్మస్వరూపుఁడగు ఆ నారాయణునకు నమస్కారము చేయుచున్నాను.

14. కాముడు.

శ్లో. యత స్సర్వే ప్రసూయంతే హ్యనంగాత్మాంగదేహినః
ఉన్మాద స్సర్వభూతానాం తస్మై కామాత్మనేనమః. 54

టీక. యతః = ఏ పరమేశ్వరునివలన, సర్వే = ఎల్లరు, అనంగ + ఆత్మ + అంగ + దేహినః = కామమయములైన శరీరములుగల జీవులు. ప్రసూయంతే = జన్మించుచున్నారో, సర్వభూతానాం = అన్ని భూతములకు, ఉన్మాదః = కామోద్రేకమును గల్గించువాఁడెవఁడో, కామాత్మనే = కామస్వరూపుఁడైన, తస్మై = ఆ లక్ష్మీమనోహరునికి, నమః=నమస్కారము.

తా. ఏ భగవంతుని వలనఁ గామమయ శరీరులైన (ఇంద్రియ భోగలాలసులనుట) జీవులు పుట్టుచున్నారో ఎవ్వఁడు సర్వభూతములకుఁ గామోద్రేకమును గల్గించు

వాఁడో. అట్టి కామస్వరూపుఁడగు (మన్మధ స్వరూపుఁడగు) లక్ష్మీవల్లభునకు నమస్కారము. జగమునం బ్రభవించు జీవులెల్లను సామాన్యముగ ఆహారనిద్రాభయ సంగమాదు లకు గుఱియై ఇంద్రియాభిలాషులై జన్మించుచుందురు. వారల మన్మధుఁడు కామోద్రేకము గల్గించి పిచ్చివారలను జేయు చున్నాఁడు. ఆ రూపమున నుండువాఁడు హరియే యనుట.

15. క్షేత్రము.

శ్లో. యంచ వ్యక్తస్థ మవ్యక్తం విచిన్వంతి మహర్షయః
క్షేత్రే క్షేత్రజ్ఞమాసీనం తస్మై క్షేత్రాత్మనేనమః. 55

టీక. యంచ = ఏ దేవునైతే, మహర్షయః = మహర్షులు, అవ్యక్తం = ఇంద్రియములకు గోచరించనివాఁడై, వ్యక్తస్థం = దేహములోపల నున్నట్టియు, క్షేత్రే = బుద్ధియను గుహ యందు, లేక సూక్ష్మశరీరమునందు, ఆసీనం = కూర్చుండినట్టి, క్షేత్రజ్ఞం = ప్రత్యగాత్మను, విచిన్వంతి = ధ్యానసమాధులతో వెదకుచున్నారో, క్షేత్రాత్మనే = క్షేత్రస్వరూపుఁడైన, తస్మై = ఆ పరమాత్మునకు, నమః = నమస్కారము.

తా. మహర్షులే దేవు నింద్రియములకు గోచరింపని వాఁడగుట నవ్యక్తుఁ డన్న పేరుపొందినవాఁడై దేహము లోపల నిల్చియున్నవానిని ఇంద్రియమనోబుద్ధులతోఁ గూడిన సూక్ష్మశరీరమునందు, లేక బుద్ధియను క్షేత్రము లేక గుహ యందు క్షేత్రజ్ఞుఁడై దేహేంద్రియాది ప్రపంచము దెలిసికొను

ప్రత్యగాత్మయై జీవుఁడై నిల్చియున్న వానిఁ బరమాత్మను ధ్యాన సమాధులతో నన్వేషించుచుందురో, క్షేత్రస్వరూపి యైన ఆ పరమాత్మునికి నమస్కారము చేయుచున్నాను.

క. సువ్యక్త క్షేత్రంబున
నవ్యక్తాకృతి నిరూఢి నాసీనుండై
భవ్యత నొందెడు క్షేత్రా
త్మ వ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్. 9

16. సాంఖ్యము.

శ్లో. యం త్రిధాత్మాన మాత్మస్థం వృతం షోడశభి ర్గుణైః
ప్రాహు స్సప్తదశం సాంఖ్యా స్తస్మైసాంఖ్యాత్మనే నమః 56

టీక. యం = ఏ, ఆత్మానం = చేతనుని, జ్ఞానస్వరూపుని, సాంఖ్యాః = కపిలుని సాంఖ్యము ననుష్ఠించు మునులు, జ్ఞాన యోగులు, ఆత్మస్థం = పరమాత్మస్వరూపుఁడై మార్పులు లేక నిత్యుఁడై యుండువానిని, అనఁగా స్వరూపస్థితుని, షోడశభిః+గుణైః = పదునాఱు విధములైన గుణములతోడను, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ప్రాణములైదు, మనస్సు ఒకటిచేరి పదునారనుట) త్రిధా = మూఁడు విధము లుగా (అనఁగా జాగ్రత్స్వప్న సుషుప్తులను మూఁడవస్థలయందు ఉదార+తను = ప్రసుప్తరూపములతో, స్థూల సూక్ష్మ కారణ స్వరూపులగు విశ్వతైజస ప్రాజ్ఞులతో మూఁడు విధములుగ)

వృతం = ఆవరించినఁ బడినవానిగా (కూఁడుకొన్న వానిగా.) స_ప్తదశం = పదునేడు విధములుగా నుండువానిగా, (ఆత్మ, పదు నాఱు + మువ్విధములుగా నుండువానితో చేరి పదునేడు విధ ములగు చున్నదనుట) ప్రాహుః = వాకొనుచున్నారో, సాం ఖ్యాత్మనే = ఆ గుణముల వేనినంటక బుద్ధియందు జ్ఞాన స్వరూ పిగనుండు సాంఖ్యస్వరూపుఁడైన, తస్మై = ఆ జ్ఞానస్వరూపు నకు, నమః = నమస్కారము.

తా. కపిలుని సాంఖ్యమత మనుష్ఠించువారు జ్ఞాన యోగులు, సంఖ్యయనఁగా బుద్ధి, దానిధర్మము జ్ఞానము, కాఁబట్టి సాంఖ్యమనఁగా జ్ఞానమని యర్థము. వారి సాంఖ్య మతమున నిరువదినాలుగు త_త్త్వములు మాత్రమే జగమునకు హేతువులైనవి. వానినిటఁ దెల్పుచున్నాము.

శ్లో. మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయః
స_ప్త షోడశకస్తు వికార ర్న ప్రకృతి ర్న వికృతిః పురుషః.

ఇవి : ప్రకృతి, ప్రకృతివికృతులు, వికృతులు, ప్రకృతి వికృతిగానిది, అని త_త్త్వములు. నాలుగు విధములుగ నున్నవి. అనేముల కుత్ప_త్తి కారణమైనది ప్రకృతి. ఒకదానినుండి పుట్టినది వికృతి. ఈ రెండు ధర్మములుగలవి ప్రకృతి వికృ తులు. ఆ రెండు ధర్మములు లేనిది, మఱియొకటి.

కేవలము ప్రకృతి = మూలప్రకృతి.

మహత్తత్త్వము, అహంకారము. పంచతన్మాత్రలు = ప్రకృతివికృతులు.

ఇవి పంచభూతముల కుత్పత్తికిఁ గారణమైనందునఁ బ్రకృతులును, మూలప్రకృతివలనఁబుట్టిన వగుటవలన వికృతులునై యున్నవి. జ్ఞానేంద్రియ + కర్మేంద్రియ + పంచ ప్రాణ+మనస్సులు = 16 పదునారుచేరి కేవలము వికృతులు, వానివలన నేవస్తువు పుట్టదు కావునఁ బ్రకృతులుగావు, ఇవి మహదాదుల వలనఁ బుట్టునవి కావున వికృతులు. ప్రకృతియు వికృతియుఁ గానివాఁడు పురుషుఁడు. ఇతఁడొక దానివలనఁ బుట్టఁడు, ఒకదానిని బుట్టింపఁడు.

తా. సాంఖ్యులే పురుషోత్తముని నిత్యునిగాను, షోడశ వికారములతోఁ (దశవిధములగు నింద్రియములు, పంచప్రాణ ములు, మనస్సు అను పదునాఱుగుణములతో) గూడిన వానిని గానుస్థూలసూక్ష్మకారణ శరీరియై పదునేడవవాఁడునై యుండు వానిని గాను జెప్పుదురో ఆ గుణముల వేని నంటనివాఁడై సాఁఖ్యస్వరూపుఁడైన జ్ఞానస్వరూపుఁడైన ఆ పరమాత్మునికి నమస్కారము చేయుచున్నాను.

క. ప్రకృతి వికృతులను షోడశ
వికారములఁ బెరసి ప్రకృతి వికృతిత్వముఁ బొం
దక యుండఁ గాంతు రెవ్వని
సకలమునులుఁ దలఁతు నట్టి సాంఖ్యాత్మహరిన్. 9

17. యోగము.

శ్లో. యం వినిద్రాజితశ్వాసాః సత్త్వస్థా స్సంయతేంద్రియాః
జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః. 57

టీక. యం = ఏ పరంధాముని, వినిద్రాః = నిద్రను తమోరూపమును అజ్ఞానమును వీడినవారును, జితశ్వాసాః = ప్రాణాయామమును చేయఁగలవారును, సత్త్వస్థాః = మనోబుద్ధులను సాత్త్వికములుగ నిల్పుకొన్నవారును, సంయత + ఇంద్రియాః = నియమ బద్ధములుగాఁ జేసికొన్న యింద్రియములు గలవారునైన యోగులు, యుంజానాః = చిత్తసమాధానము చేసికొన్నవారై, జ్యోతిః = స్వయంప్రకాశమైన వానినిగా, పశ్యంతి = చూచుచున్నారో, యోగాత్మనే = దేహాధిష్ఠితుఁడై సర్వమును బ్రకాశింపఁజేయుచు నిర్మలుఁడై యున్న యోగస్వరూపుఁడగు, తస్మై = ఆ శ్రీహరికి, నమః = నమస్కారము

తా. నిద్రను (తమోరూపమగు నజ్ఞానమును) వీడినవారును శ్వాసను జయించినవారు అనఁగా రేచకపూరక కుంభకములను ముప్విధములైన ప్రాణాయామ మాచరించి ప్రాణనిరోధమును జేసినవారును, జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను మనస్సును సంయమనమును జేసినవారును అనఁగా వానివాని విషయములకు నిచ్ఛగించి స్వేచ్ఛగాఁబోనీక యరికట్టి వానిని లోఁగొన్నవారును, చిత్తము సమాధానము చేసి హార్దాకాశమున లేక భ్రూమధ్యమున (ఇది యోగులకుపాస్య

స్థానము) నుండు బుద్ధియందు సుషుమ్నా నాడీమండలమున వెలుంగు జ్యోతిని(సూర్యచంద్రాగ్ని విద్యున్నక్షత్రముల ప్రకాశముకంటె మించి ప్రకాశించునట్టి నిత్యము నుత్తమమునైన జ్యోతిని ననుట) గాంచుచున్నారో దేహేంద్రియాది ప్రపంచముతోఁ గూడియు వాని గుణములంటకుండు యోగస్వరూపుని కా కృష్ణునికి నమస్కారము చేయుచున్నాను.

క. అంతశ్చరమారుతములు
శాంతములుగఁ జేసి యనలసత్త్వము శమముఁ
దాంతియుఁ గలజనములు గను
నంతర్హితుఁ గొలుతుఁ జలశయను యోగాత్మున్. 10

18. మోక్షము.

శ్లో. అపుణ్య పుణ్యోపరమే యం పునర్భవనిర్భయాః
శాంతా స్సన్న్యాసినో యాంతి తస్మై మోక్షాత్మనే నమః. 58

టీక. అపుణ్య+పుణ్య+ఉపరమేసతి = పాపము, పుణ్యము అనువాని సంబంధము విడిపోవున దగుచుండగా, పునర్భవనిర్భయాః = పునర్జన్మము విషయమై యే భయము లేనివారై (తమకింక పునర్జన్మము గల్గదను నిశ్చయముచే భయరహితులైనారనుట.) శాంతాః = సర్వకామముల నుండి శాంతించిన మనస్సుగలవారైన, సన్న్యాసినః = సర్వసంగ పరిత్యాగులైన సన్న్యాసులు, యం = ఏ బ్రహ్మమునుగూర్చి, యాంతి = వెళ్లు

దురో అనఁగా బ్రహ్మమును బొందుదురో, మోక్షాత్మనే = ప్రాపంచిక సంబంధములంటక ముక్తస్వరూపుఁడైన, తస్మై = ఆ పరమాత్మునికి, నమః = నమస్కారము.

తా. అనేకజన్మములనుండి తా మొనర్చిన పాపపుణ్యములు రెండును ఉత్తరజన్మములకుఁ గారణమైనవి, తామీ జన్మమందు బ్రహ్మార్పణబుద్ధితోఁ జేసిన నిష్కామకర్మచే రూపఱినశింపగా కోరిక లన్నింటినుండి విడిపోయి మనస్సు శాంతింపగా సర్వసంగ పరిత్యాగులైన సన్న్యాసులు తమ కింకఁ బునర్జన్మమువలని భయము లేదను నిశ్చయముగలవారై యే బ్రహ్మమును సాయుజ్యరూపమునఁ జేరుచున్నారో మోక్షస్వరూపుఁడైన యా శ్రీకృష్ణునకు నమస్కారము చేయుచున్నాను.

క. అపరభవమునఁ బ్రాపించిన
నపుణ్య పుణ్యములు దలఁగు నతిశాంతులు భ
వ్యపుగతిఁ బొందెడు నానఁ
దపు రూపపు విష్ణుదలఁచెదఁ మోక్షాత్మున్. 11

19. ఘోరము – సంకర్షణుఁడు

శ్లో. యోఽసౌ యుగసహస్రాంతే ప్రదీప్తార్చి ర్విభావసుః
సంభక్షయతి భూతాని తస్మై ఘోరాత్మనే నమః. 59

టీక. యః = ఏ, అసౌ = ఈ మహావిష్ణువు, యుగసహస్ర + అంతే = యుగముల వేయింటితుదను, ప్రదీప + అర్చిః = ప్రజ్వ

లించు జ్వాలలుగల, విభావసుః = అగ్నియై, భూతాని = సర్వ భూతములను, సంభక్షయతి=తనలోనికి నాకర్షించుచున్నాఁడో ఘోర + ఆత్మనే = భయంకర స్వరూపుఁడైన, తస్మై = ఆ శ్రీ కృష్ణునకు (సంకర్షణమూర్తికి) నమః = నమస్కారము.

తా. ఏ భగవంతుఁడీ సర్వప్రపంచమునకు మూలకారణమై యున్నాఁడో, వేయి మహాయుగములు అనఁగా కృత, త్రేతా, ద్వాపర కలియుగములు చేరిన కాలమొక మహాయుగము. వీని సంఖ్య, కృతయుగ సంవత్సరములు 17 లక్షలు 28 వేలు, త్రేతాయుగ సం॥ 12 లక్షలు 96 వేలు, ద్వాపర యుగ సం। 8 లక్షలు 64 వేలు, కలియుగ సం॥ 4 లక్షలు 32 వేలు. కాలము పరిమితిగలవి. ఇవి నాలుగు చేరిన 43 లక్షలు 20 వేల సంవత్సరముల కాలము ఒక్క మహాయుగము అట్టి మహాయుగములు వేయియైన 4320000 × 1000 = 43200,00,000 నన్నూటముప్పదిరెండుకోట్ల సంవత్సరముల కాలము. బ్రహ్మదేవునికి ఒకపగలగును. అదిసామాన్య ప్రళయము. ఆదిత్యునుదయాస్తము లంతటితో నాఁగిపోవును. అంత బ్రహ్మదేవునికి రాత్రి ప్రారంభమగును. అప్పుడు పాతాళమునుంచి మహావిష్ణువు సంకర్షణమూర్తియై అగ్నిజ్వాలల భూమిపైకిఁ బ్రసరింపఁజేసి భూతకోటినంతయు సంహారము చేయునని పురాణగాథ రాత్రి 432 కోట్ల సం॥ల తర్వాత మరల సృష్టిప్రారంభమగును.

20. మాయ — వటపత్రశాయి.

శ్లో. సంభక్ష్య సర్వభూతాని కృత్వా చైకార్ణవం జగత్
బాలస్స్వపితి యశ్చైక స్తస్మై మాయాత్మనేనమః. 60

టీక. యః = ఎవఁడైతే, సర్వభూతాని = అన్ని భూతములను సంభక్ష్య తనలో నడంచుకొని (సంహారముగావించి) జగత్ = లోకమును, ఏక + అర్ణవం = ఒక్కటే జలమయమైన సముద్రముగా, కృత్వా = చేసి, ఏకః = ఒక్కఁడేయైన, బాలః = బాలుఁడై, స్వపితి = నిద్రించుచున్నాఁడో, మాయాత్మనే = మాయాస్వరూపుఁడైన, తస్మై = ఆ శ్రీ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఎవ్వఁడు సమస్తభూత సంహారముగావించి జగమంతయు నొక్కటే జలార్ణవముగావించి తానొక్కడై బాలుడై నిద్రించుచున్నాఁడో మాయాస్వరూపియైన యా శ్రీ మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

ప్రళయకాలమునందు జగమంతయు జలమయమైనప్పుడు ఒక్క మఱ్ఱిచెట్టుండుననియు, యందలి యొక్క యాకుమీఁద మహావిష్ణువు బాలుఁడై వటపత్రశాయియై నిద్రించుచుండుననియు పురాణగాథ.

క. భూతములఁ బ్రమింగి లోక
వ్రాతము జలమయముసేసి వశ్యాత్మక ని
ద్రాతిశయంబున బాలుం
డై తేలెడు వానిఁ దలఁతు హరిమాయాత్మున్. 12

21. పద్మము – బ్రహ్మ

శ్లో. అజస్య నాభౌ సంభూతం యస్మిన్ విశ్వం ప్రతిష్ఠితమ్
పుష్కరే పుష్కరాక్షస్య తస్మై పద్మాత్మనే నమః. 61

టీక. అజస్య = జన్మరహితుఁడైన, పుష్కరాక్షస్య = కమలములవంటి నేత్రములు గలవాఁడైన యే మహావిష్ణువుయొక్క నాభౌ=బొడ్డునందు, సంభూతం=ఏది జన్మించినదో, యస్మిన్=ఏ పుష్కరే = పద్మమునందు, విశ్వం = సర్వజగము, ప్రతిష్ఠితం= నెలకొనియున్నదో, పద్మాత్మనే=పద్మస్వరూపుఁడైన, తస్మై= ఆ పద్మనాభునకు, నమః = నమస్కారము.

ఏది, జన్మాదులు లేనివాఁడైన పద్మములవంటి నేత్రములు గలవాఁడైన విష్ణువుయొక్క నాభియందు జన్మించెనో, ఏ పద్మమునందు ఈ సర్వజగము నిల్చియున్నదో అట్టి పద్మస్వరూపుఁడగు మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

22. యోగనిద్ర – ఆదిశేషుఁడు.

శ్లో. సహస్రశిరసే చైవ పురుషాయామితాత్మనే
చతుస్సముద్ర పర్యాయ యోగనిద్రాత్మనే నమః. 62

టీక. సహస్ర శిర సేచ=వేయి శిరములు గలవాఁడును, పురుషాయ+ఏవ = పూర్ణుఁడై పురుషుఁడైన వాఁడును, అమిత + ఆత్మనే = పరిమాణమునకు దూరమైన స్వరూపము గలవాఁడునైన, చతుః + ఆత్మనే చతుః = నాలుగైన, ప్రసుప్త +

తను + విచ్ఛిన్న + ఉదారములను, సముద్ర = కామముల యొక్క, పర్యాయ = నిర్గమనముగలదైన యోగనిద్రా + ఆత్మనే = యోగనిద్రాస్వరూపుఁడైన వానికొఱకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు వేయిశిరములుగలవాఁడును, పురుషోత్తముఁడై అప్రమేయుఁడై యున్నవాఁడో, జాగ్రత్స్వప్నసుషుప్తి మాయావస్థలను నాలుగింటియందును, ఏ యోగనిద్ర, కామ రూపములైన స్థూల సూక్ష్మ కారణ మహాకారణముల సృజించుచున్నదో అట్టి యోగనిద్రయే స్వరూపము గలవాని కొఱకు శ్రీహరికినమస్కారము చేయుచున్నాను.

23. తోయము.

శ్లో. యస్య కేశేషు జీమూతానద్యస్సర్వాంగసంధిషు
కుక్షౌ సముద్రా శ్చత్వార స్తస్మైతోయాత్మనేనమః. 63

టీక. యస్య = ఎవనియొక్క, కేశేషు = వెంట్రుకలయందు, జీమూతాః = మేఘములును, సర్వాంగ+సంధిషు = అన్నియవయవములయొక్క సంధులయందు (కీళ్లయందు) నద్యః = నదులును, కుక్షౌ = గర్భమునందు, చత్వారః + సముద్రాః = నాలుగు సముద్రములు, (వెలుంగుచున్నవో) తోయాత్మనే = జలమయుఁడైన, తస్మై = ఆ నారాయణునకు, నమః = నమస్కారము.

తా. ఎవని కేశములు మేఘములై అవయవముల సంధులు నదులై కుక్షి నాలుగుసముద్రములై వెలుఁగుచున్నవో ఆ తోయస్వరూపుఁడగు నారాయణునకు నమస్కారము.

తే. గీ. అంబుదంబులు కేశంబులందునదులు
సర్వతనుసంధులందులు జలధులుదర
దేశముల యందునున్నట్టి దేవ దేవుఁ
గొలుతుఁ దోయాత్ము దేవకీకొడుకుఁ గృష్ణు. 13

24. హేతువు.

శ్లో. యస్మాత్సర్వే ప్రసూయంతే సర్గప్రళయవిక్రియాః
యస్మింశ్చైవ ప్రలీయంతే తస్మై హేత్వాత్మనే నమః. 64

టీక. యస్మాత్ = ఎవనివలన, సర్వే = సమస్తములైన, సర్గ + ప్రళయ + విక్రియాః = సృష్టి లయములను వికారములు, ప్రసూయంతే = కలుగుచున్నవో.

యస్మిన్ + చ + ఏవ = ఎవనియందే, ప్రలీయంతే = అవియన్నియు లీనమై పోవుచున్నవో, హేత్వాత్మనే = సర్వమునకుఁ గారణస్వరూపుఁడైన, తస్మై = ఆ పరమేశ్వరునకు, నమః = నమస్కారము.

తా. ఎవనివలన సమస్తములైన జగముల సృష్టి స్థితి లయములు గలుగుచున్నవో, కడపట నెవనియందివియన్నియు నడఁగి పోవుచున్నవో. సర్వకారణ స్వరూపుఁడగు నట్టినారాయణునకు నమస్కారము చేయుచున్నాను.

25. ద్రష్ట.

శ్లో. యోనిషణ్ణో భవేద్రాత్రౌ దివా భవతి తిష్ఠతః
ఇష్టానిష్టస్యచ ద్రష్టా తస్మై ద్రష్టాత్మనేనమః. 65.

టీక, యః = ఎవ్వఁడు, రాత్రౌ = మహాసుషుప్తియందును, (సర్వము లయమైన సమయమందు) నిషణ్ణః = (ఊరక) కూర్చుండువాఁడై, భవేత్ = అగునో, తిష్ఠతః = కర్తృరూప సంకల్పమాత్రుఁడైన యెవనివలన, దివా = పగలు, (జాగ్రత్స్వప్నములు) అగుచున్నవో. ఎవఁడు, ఇష్ట + అనిష్టస్య + చ = సుఖమునకుఁ గారణమైన పుణ్యకర్మము, దుఃఖమునకుఁ గారణమైన పాపకర్మము. అనువానికి, ద్రష్టా = చూచు వాఁడై యున్నాఁడో, ద్రష్టాత్మనే = ద్రష్ట (సాక్షి) స్వరూఁపు డైన, తస్మై = ఆ పుండరీకాక్షునకు నమస్కారము.

యః = ఎవఁడు, నిషణ్ణః = కూర్చుండినంతమాత్రమున రాత్రిః = రాత్రి, (అంధకారరూపమైన) ప్రళయమగునో, తిష్టతః = లేచినిలుచున్న ఎవనివలన, దివా = పగలు, సృష్టిస్థితు లగునో.

తా. ఎవ్వఁడుతూష్ణీంభావమున (ఊరక) కూర్చుండి నంతనే జగములకన్నింటికి మహాప్రళయము సంభవించు చున్నదో, సర్వజగములు లయావస్థనుబొందినప్పుడు కూడ నెవ్వఁడు కూర్చుండి సాక్షిభూతుఁడై యుండునో, ఎవఁడు సంకల్పమాత్రమునఁ గర్తృస్వరూపమున నున్నంతన జగము

లకు జాగ్రత్స్వప్నావస్థలు గలుగుచున్నవో (సృష్టిస్థితులు) గలుగుచున్నవో అనుట). ఎవఁడు జీవకోటులు చేయు పుణ్యా పాప కర్మములను సుఖదుఃఖములకుఁ గారణమైన వానిని చూచుచుఁ గేవలము ద్రష్టయైయున్నాఁడో ద్రష్టృస్వరూపుఁడై దేనికిని దాను గర్తగాక కేవలము సాక్షిభూతుఁడై ప్రకాశించు నా వాసుదేవునకు నమస్కారము చేయుచున్నాను.

26. కార్యము — చక్రధారి.

శ్లో. అకుంఠం సర్వకార్యేషు ధర్మకార్యార్థ ముద్యతమ్.
వైకుంఠస్యహి యద్రూపంతస్మై కార్యాత్మనే నమః. 66

టీక. వైకుంఠస్య = వైకుంఠునియొక్క, యత్ + రూపం = ఏ రూపము, సర్వకార్యేషు = జగముయొక్క సృష్ట్యాదులగు సర్వకార్యములందు, అకుంఠం = మొక్కవోనిదో, నిరంకుశమై, అడ్డులేక ప్రవర్తించునదో, ధర్మకార్యార్థం = వేదోద్ధరణ, యజ్ఞపాలన, భక్తరక్షణాది ధర్మకార్యముల కొఱకు ఉద్యతమ్ = ఎల్లప్పుడు సంసిద్ధమైయుండునదో, కార్యాత్మనే = కార్యస్వరూపుఁడగు, తస్మై = ఆ చక్రధరునకు, నమః = నమస్కారము.

తా. వైకుంఠునియొక్క యేస్వరూపము సర్వకార్యములందు సృష్టిస్థితిలయాది జగత్క్రియలందు నిరాఘాటముగఁ బ్రవర్తించునదో మఱియు వేదోద్ధరణ, శత్రుసంహారణ,

యజ్ఞ పాలన, భక్తరక్షణాది కార్యములకు సంసిద్ధమై యుండు నదో, కార్యస్వరూపుఁడైన ఆ చక్రధారికి నమస్కారము చేయుచున్నాను.

27. క్రౌర్యము — పరశురాముఁడు.

శ్లో. త్రిస్సప్తకృత్వో యః క్షత్రం ధర్మవ్యుత్క్రాంతగౌరవమ్
క్రుద్ధో నిజఘ్నే సమరే తస్మై క్రౌర్యాత్మనే నమః. 67

టీక. యః = ఏ విష్ణువు, క్రుద్ధః = మిగుల క్రోధముఁ జెందిన వాఁడై, త్రిస ప్తకృత్వః = మూఁడేఁడుమారులు. (ఇరువదొక్కమారులు దండయాత్రలు చేయుట గలవాఁడై), ధర్మ + వ్యుత్క్రాంత + గౌరవమ్ = రాజధర్మమునకు వెలిగా నతిక్రమించి ప్రవర్తించుచు బలవంతమై లేక భూమికి బరువైన, క్షత్రం = క్షత్రియజాతిని, సమరే = యుద్ధమునందు, నిజఘ్నే = చెండాడి చంపెనో, క్రౌర్యాత్మనే = అత్యంత క్రూరస్వరూపుఁడగు, తస్మై = ఆ జనార్దనునకు, నమః = నమస్కారము.

తా. ఏ శ్రీ మహావిష్ణువు భూమండలమునఁ బరిపాలకులై రాజధర్మముల నుజ్జగించి స్వతంత్రులై యధర్మపరులైన రాజాధములపై మిగుల నలుకఁ జేసి యిరువదొక్కమారు దండయాత్రలఁ జేసి రాచపుర్వు పొడగాన రాకుండఁ జెండాడెనో క్రౌర్యస్వరూపుఁడగు నా శార్ఙ్గికి నమస్కారము.

గీ. పరశురాముఁడనఁగ భవ్యుండు జమదగ్ని
కుద్భవించి యిరువదొక్కమాఱు
మనుజపతుల నెల్ల దునిమిన క్రోధాత్ము
నధికభక్తి శార్ఙ్గి నాశ్రయింతు. 14

28. వాయువు.

శ్లో. విభజ్య పంచధాత్మానం వాయుర్భూత్వా శరీరగః
యశ్చేష్టయతి భూతాని తస్మై వాయ్వాత్మనే నమః. 68

టీక. యః = ఏ దేవుఁడు, ఆత్మానం = తన్ను, పంచధా = అయిదు విధములుగ, (పంచప్రాణములుగ) విభజ్య = విభాగించి, శరీరగః = శరీరమంతయు వ్యాపించిన, వాయు + భూత్వా = ప్రాణాది వాయువుగనుండి, భూతాని = ప్రాణికోట్లను చేష్టయతి = శరీరేంద్రియముల వ్యాపారములను కదలికను గలవానినిగాఁ జేయుచున్నాఁడో, వాయ్వాత్మనే = వాయుస్వరూపుఁడగు, తస్మై = ఆ గోవిందునకు, నమః = నమస్కారము.

తా. ఏ పరమేశ్వరుఁడు తన్నయిదు విధములుగా (ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనువిధముల) విభజించి శరరీమంతయు వ్యాపించివాయు రూపముననుండి (ప్రాణము హృదయమునందు గుదస్థానమున అపానము, వీనినడుమ లేక శరీరమునందంతయు వ్యానము, కంఠమునందు ఉదానము, నాభిస్థానమునందు సమానము

అను పంచప్రాణములు శరీరమునందు వెలసియున్నవనుట), ప్రాణికోటుల నన్నింటిని శరీరచేష్టలు గలవానిగ (లేచుట, కూర్చుండుట చాచుట ముడుచుకొనుట, తెప్పలువాల్చుట ఉచ్ఛ్వాస నిశ్వాసములు గావించుట అనునవి చేష్టలు జీవించుటయు వాయువువలననే,) ప్రవర్తింపఁ జేయుచున్నాఁడో వాయుస్వరూపుఁడగు ఆ పురుషోత్తమునకు నమస్కారము చేయుచున్నాను.

29. కాలము.

శ్లో. యుగేష్వావర్తతే యోగై ర్మాసర్త్వయన హాయనైః
సర్గః ప్రళయయోః కర్తా తస్మై కాలాత్మనే నమః. 69

టీక. యః = ఎవఁడు, యుగేషు = కృతత్రేతాది చతుర్యుగములను, మాస + ఋతు + అయన + హాయనైః = చైత్రాది మాసములు, వసంతాదిఋతువులు దక్షిణోత్తరాయణములు ప్రభవాది సంవత్సరములచే నైన, యోగైః = కూడికలచే ఆవర్తతే = మరలమరల రాకపోకలు గావించుచున్నాఁడో, (అర్థాంతరము, మాస–హాయనైః=మాసాదిరూపముల నేర్పడు కృతాదిషు=కృతాది చతుర్యుగములందు, యోగైః = యోగమాయా బలముచేనైన మత్స్య, కూర్మాదులగు నవతారములచే, ఆవర్తతే = పటమువలె (విస్తరిల్లి ముడుచుకొనుచుఁ బ్రవర్తించుచున్నాఁడో) సర్గప్రళయయోః = సృష్టికి, ప్రళయమునకు, కర్తా = కర్తయైనవాఁడో, కాలాత్మనే = కాలస్వరూపుఁడగు తస్మై = ఆ శ్రీకృష్ణునకు నమస్కారము.

తా. ఏదేవుఁడు చైత్రాదిమాసములు, వసంతాది ఋతువులు, దక్షిణోత్తరాయణములు, ప్రభవాది సంవత్సరముల కూడికచే కృత త్రేతా ద్వాపర కలియుగములను మాటిమాటికి ఆవృత్తియగునట్లు చేయుచున్నాఁడో, ఎవఁడు జగముల సృష్టికి లయమునకుఁ (స్థితికిగూడ) కర్తయై యున్నాఁడో, కాలస్వరూపుఁడగు నా గోవిందునకు నమస్కారము. నీలకంఠ వ్యాఖ్య. మాసాదులచేనగు కృతాదియుగములు వచ్చునప్పుడు ఎవఁడు యోగమాయాబలమునఁ బటమువలె మత్స్యాద్యవతారముల సంకోచ వికాసములఁ గావించునో, అని వ్రాయఁబడినది.

క. మాస ర్త్వయనాబ్ద మయో
ద్భాసిత రూపుఁడయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం
జేసి పొలుపారు శౌరి ను
పాసింతును యోగిభోగ్య బలుఁ గాలాత్మున్. 15

30. వర్ణము.

శ్లో. బ్రహ్మవక్త్రం భుజౌ క్షత్రం కృత్స్నమూరూదరం విశః
పాదౌ యస్యాశ్రితాశ్శూద్రా స్తస్మై వర్ణాత్మనే నమః. 70

టీక. యస్య = ఏ దేవునికి, బ్రహ్మ = బ్రాహ్మణజాతి, వక్త్రం = ముఖమో, క్షత్రం = క్షత్రియజాతి, భుజౌ = భుజములో, కృత్స్నం = సమస్తమైన, ఊరు + ఉదరం = తొడలు, కడుపు, విశః = వైశ్యులో, (వైశ్యజాతియో) పాదౌ = పాద

ములు, శూద్రాః=శూద్రులో, (శూద్రజాతి) వర్ణాత్మనే=వర్ణ స్వరూపుఁడగు, తస్మై=ఆ విష్ణువునకు, నమః=నమస్కారము.

తా. ఎవనికి ముఖము బ్రాహ్మణజాతియు, భుజములు క్షత్రియజాతి, ఊరువులు, ఉదరము, వైశ్యులు, పాదములు, శూద్రులునై తేజరిల్లుదురో వర్ణస్వరూపుఁడగు నా మహా విష్ణువునకు నమస్కారము చేసెదను.

తే. గీ. వదనబాహూరుపదము లెవ్వాఁడు విప్ర
రాజవైశ్యశూద్రులకు సంప్రభవదేశ
ములుగ వెలుఁగొందు నమ్మహామూర్తి విభవ
దీప్తు వర్ణాత్మకునిఁ బ్రణుతింతు విష్ణు. 16

31. శ్లోకము.

శ్లో. యస్యాగ్ని రాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభి శ్చరణౌ క్షితిః
సూర్యశ్చక్షు ర్దిశః శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః. 71

టీక. యస్య=ఎవనికి, అగ్నిః=అగ్ని, ఆస్యం=ముఖమో ద్యౌః=స్వర్గము, మూర్ధా=శిరస్సు, ఖం=ఆకాశము, నాభి=బొడ్డు, క్షితిః=భూమి, చరణౌ=పాదములు, సూర్యః= సూర్యుఁడు, చక్షుః=చక్షువులు, దిశః=దిక్కులు, శ్రోత్రం= చెవులుగనున్నవో, లోకాత్మనే=లోకస్వరూపుఁడగు, తస్మై= ఆ నారాయణునికి, నమః=నమస్కారము.

తా. ఏ మహానీయునికి అగ్ని ముఖము, స్వర్గము శిరస్సు, ఆకాశము నాభి, భూమి పాదములు, సూర్యుఁడు చక్షువులు, దిక్కులు చెవులునై యున్నవో లోకస్వరూపుఁడగు నా నారాయణునకు నమస్కారము చేయుచున్నాను.

తే. గీ. చరణనాభిశీర్షంబులు ధరయు నంత
రిక్షమును దివమును జగచ్చక్షు రగ్ని
దిశలు దృఙ్ముఖశ్రోత్రముల్ దీప్తు లెవ్వ
హాత్మునకు నట్టి హరిని లోకాత్ముఁ దలఁతు. 17

32. విశ్వము.

శ్లో. పరః కాలాత్పరో యజ్ఞా త్పరాత్పరతర శ్చ యః
అనాదిరాది ర్విశ్వస్య తస్మై విశ్వాత్మనేనమః. 72

టీక. యః = ఎవఁడు, కాలాత్ = కాలముకంటె, పరః = పరుఁడో, (ఇతరుఁడో, భిన్నుఁడో) యజ్ఞాత్ =యజ్ఞముకంటె, పరః = పరుఁడో, పరాత్ = హిరణ్యగర్భునికంటె, పరతరః = మిక్కిలి పరుఁడో, మాయావి యైనను స్వయముగా శుద్ధుఁడో, అనాది = ఆదియనఁగా మొదలు, ఆది లేనివాఁడు అనాదియో, విశ్వస్య = సర్వజగమునకు, ఆదిః = మొదలైనవాఁడో, విశ్వాత్మనే = విశ్వస్వరూపుఁడైన, తస్మై =ఆ యచ్యుతునకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు భూతభవిష్యాది కాలములకంటె భిన్నుఁడై యజ్ఞాది కర్మలకంటెఁ (ఇష్టాపూర్తములగు ధర్మములగు నిత్య నైమిత్తికాదులు జ్యోతిష్టోమాదులు) బరుఁడై హిరణ్య గర్భునికంటె (ప్రపంచ సూక్ష్మరూపుఁడు) మిక్కిలి పరుఁడై మాయావియై స్వయంశుద్ధుఁడై అనాదియయ్యు విశ్వమున కాదియై విశ్వమయుఁడై వెలుఁగుచున్నాఁడో ఆ యచ్యుతు నకు నమస్కారము చేయుచున్నాను.

33. గోప్త.

శ్లో. విషయేవర్తమానానాం యంతై ర్వైశేషికైర్గుణైః
ప్రాహు ర్విషయగోప్తారం తస్మై గోప్త్రాత్మనేనమః. 73

టీక. యంవై=ఎవనినైతే, విషయే=శ్రోత్రాదులగు నింద్రియములకు గోచరములగు, శబ్దాది విషయములందు, వర్త మానానాం=ప్రవర్తించు వారలకు, వైశేషికైః=విశేషము లైన, గుణైః=రాగము, ద్వేషము అను గుణములచేత విషయగోప్తారం = శబ్దాది విషయములను రక్షించువానిఁగా, ప్రాహుః = చెప్పుదురో, గోప్త్రాత్మనే = రక్షకుని రూపమున నుండు, తస్మై = ఆ శ్రీపతికి, నమః = నమస్కారము.

తా. సర్వసుఖములకు ఆస్పదములైన శబ్దస్పర్శరూప రసగంధములను విషయములందు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములను నింద్రియములఁ బ్రవర్తింపఁ జేయుచున్నవాఁడు

రాగద్వేషములను గుణములచే వారి విషయసుఖములను శా లించుచునుండు (రాగముచే నిష్టమును బరిగ్రహించుట ద్వేష ముచే అనిష్టమును బరిహరించుటద్వారా)గో ప్తయైన(రక్షించు వాఁడై) రూపుతోనుండు నా శ్రీపతికి నమస్కారము చేయు చున్నాను.

34. ప్రాణము.

శ్లో. అన్నపానేంధనమయో రసప్రాణ వివర్ధనః
యోధారయతి భూతాని తస్మైప్రాణాత్మనేనమః. 74

టీక. యః = ఏ పరమేశ్వరుఁడు, అన్న + పాన + ఇంధన మయః = అన్నము, పానీయము, దీప్తి, (అన్నపానీయముల రెండింటిని జీర్ణింపఁజేయు జఠరాగ్ని) స్వరూపుఁడై, రసప్రాణ వివర్ధనః = తుష్టిని, పుష్టిని వర్ధిల్లఁజేయుచున్నవాఁడై, లేక సప్తధాతువులను పంచప్రాణములను పెంచుచున్నవాఁడై, భూతాని = ప్రాణిసమూహమును, ధారయతి = జీవింపఁజేయు చున్నాఁడో, ప్రాణాత్మనే = ప్రాణస్వరూపుఁడగు, తస్మై = ఆ మాధవునకు, నమః = నమస్కారము,

తా. ఎవఁడు వ్రీహ్యాదులయన్న స్వరూపుఁడై జలాది పానీయముల నొసంగుచు వానిని జీర్ణింపఁజేయు దీప్తియై జఠ రాగ్ని రూపమున వర్తించుచు సప్తధాతువులగు చర్మము, రక్తము, మాంసము, నరములు, శల్యములు, మూలికలు

వీర్యము అనువానిని ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము సమానము అను పంచప్రాణములను వర్ధిల్లఁ జెంచుచు, తుష్టిని (తృప్తి) పుష్టిని, బలమును, కలిగించుచు సర్వభూతములను దేహధారులుగ నుండి జీవయాత్రఁ జేయ భరించుచున్నాఁడో, (ఆ దేవునివలననే సర్వభూతములు దేహధారులై ప్రవర్తించుచున్నవనుట) అట్టి పంచప్రాణ స్వరూపుఁడగు నారాయణునకు నమస్కారము చేయుచున్నాను.

35. పాకము — జఠరాగ్ని.

శ్లో. ప్రాణానాంధారణార్థాయ యోఽన్నం భుంక్తే చతుర్విధమ్
అంతర్భూతః పచత్యగ్ని స్తస్మై పాకాత్మనే నమః. 75

టీక. యః=ఏ దేవుఁడు, ప్రాణానాం=ఇంద్రియములు, పంచ ప్రాణములు మనోబుద్ధులులోనగు ప్రాణములయొక్క, ధారణార్థాయ = ధరించుటకొఱకు, (దేహమునందు నిల్పుకొనుటకు) చతుర్విధమ్=భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములను నాలుగు విధములైన, అన్నం = అన్నమును, భుంక్తే = భుజించుచున్నాఁడో, అంతర్భూతః = దేహములోపల నుండుచు, అగ్నిః = వైశ్వానరుఁడను పేరుగల జఠరాగ్నియై, పచతి = ఆ భుజించిన యాహారాదికమును జీర్ణింపఁ జేయుచున్నాఁడో పాకాత్మనే = అన్నమును బచనముసేయునట్టి పాకస్వరూపుఁడు, వైశ్వానరుఁడను జఠరాగ్ని స్వరూపుఁడైన, తస్మై = ఆ పురుషోత్తమునికి, నమః = నమస్కారము.

తా. ఏ దేవుఁడు, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియ పంచకము ప్రాణపంచకము. అంతఃకరణచతుష్టయము అను ప్రాణముల దేహమునందు ధరించుటకొఱకు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాములను చతుర్విధమునైన అన్నమును భుజించుచున్నాఁడో దేహములోపల వైశ్వానరుఁడను పేరి జఠరాగ్నిరూపుఁడై ఆ భుజించిన అన్నాదికమును జీర్ణింపఁ జేయుచున్నాఁడో పాకస్వరూపుఁడగు (వైశ్వానరుఁడగు) ఆ పురుషోత్తమునికి నమస్కారము చేయుచున్నాను.

36. దృప్తుఁడు – నరసింహస్వామి.

శ్లో. పింగేక్షణసటం యస్య రూపం దంష్ట్రానఖాయుధమ్
దానవేంద్రాంతకరణం తస్మై దృప్తాత్మనేనమః. 76

టీక. యస్య=ఏ జగదీశునియొక్క, రూపం = స్వరూపము, పింగేక్షణసటం=పసుపురంగుకన్నులు, జడలుగలదో, దంష్ట్రా నఖ + ఆయుధం = కోరలు, గోళ్లు ఆయుధములుగ గలదో, దానవ + ఇంద్ర + అంత + కరణం = దానవులకుఁ బ్రభువైన హిరణ్యాకశిపుని నాశముచేసినదో, దృప్తాత్మనే = గర్వించిన స్వరూపుఁడగు, తస్మై = ఆ నరసింహస్వామికి, నమః = నమస్కారము.

తా. ఏ జగదీశ్వరు స్వరూపము పసుపురంగుకన్నులు జడలు గలదై దంష్ట్రలు (కోరలు) నఖములు. ఆయుధము

లుగఁ గలదై దానవప్రభుని నాశముచేసినదో అట్టి ఉద్ధత స్వరూపుఁడగు నరసింహస్వామికి నమస్కారము చేయుచున్నాను.

37. సూక్ష్మము – బ్రహ్మము.

శ్లో. యం నదేవా నగంధర్వా నదైత్యా నచదానవాః
తత్త్వతోహి విజానంతి తస్మై సూక్ష్మాత్మనేనమః. 77

టీక. యం=ఏ దేవుని, తత్త్వతః + హి = వాస్తవముగ, దేవాః = దేవతలు, నవిజానంతి=గుర్తెఱుంగరో, గంధర్వాః+ నవిజానంతి=గంధర్వులు గుర్తెఱుంగరో, దైత్యాః+న + విజానంతి = దైత్యులు గుర్తెఱుంగరో, దానవాః + చ + న + విజానంతి=దానవులును గుర్తెఱుంగరో, సూక్ష్మాత్మనే=ఇంద్రియముల కగోచరుఁడై సూక్ష్మస్వరూపుఁడైన, తస్మై=ఆ పరబ్రహ్మమునకు, నమః = నమస్కారము.

తా. ఏ దేవుని దేవతలుగాని గంధర్వులుగాని దైత్యులుగాని దానవులుగాని నిక్కముగఁ జక్కగ నెఱుంగఁజాలరో, అట్టి సూక్ష్మస్వరూపుఁడగు పరబ్రహ్మమునకు నమస్కారము చేయుచున్నాను.

38. వీర్యాత్ముఁడు – శేషుఁడు.

శ్లో. రసాతలగత శ్శ్రీమా ననంతో భగవాన్విభుః
జగద్ధారయతే కృత్స్నం తస్మై వీర్యాత్మనేనమః. 78

టీక. రసాతలగతః = ఎవఁడు పాతాళ లోకమునందుండి శ్రీమాన్ = శ్రీమంతుఁడు, అనంతః = అనంతుఁడను పేరుగల,

భగవాన్ = భగవంతుఁడై, విభుః = నిగ్రహానుగ్రహ సమర్థుఁడై, కృత్స్నం = సమస్తమైన, జగత్ = జగమును (భూమండలమును), ధారయతే=ధరించుచున్నాఁడో, వీర్యాత్మనే= బలస్వరూపుఁడగు, తస్మై = శేషమూర్తియైన ఆ హరికి, నమః = నమస్కారము.

తా. ఎవఁడు రసాతలము (దీనికే పాతాళము, నాగలోకము, అని పేరులు) నందున్నవాఁడై, శ్రీయుతుఁడై, అనంతుఁడను పేర వెలసి షడ్గుణైశ్వర్య సంపన్నుఁడగుట భగవచ్ఛబ్దవాచ్యుడై విభుఁడై ఈ సర్వజగత్తును (భూమండలమంతయు) ధరించుచున్నాఁడో అట్టి వీర్యాత్ముఁడు, బలసంపన్నుఁడు మహాబలాఢ్యుఁడగు నాగరాజు ఆదిశేషుఁడైన విష్ణునకు నమస్కారము.

క. ముని దివిజాదికలోకము
లనంతుఁడన జగతికెల్ల నాధారంబై
పెనుపొందెడు శేషాత్ముని
వినుతింతుక్ విష్ణుభక్తి విభవవిధాయిన్. 18

39. మోహము.

శ్లో. యో మోహయతి భూతాని స్నేహపాశానుబంధనైః
సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః. 78

టీక. యః = ఏ దేవుఁడు, భూతాని = జీవకోట్లను, స్నేహపాశ + అనుబంధనైః = స్నేహము లేక ప్రేమయను పాశముల

యొక్క కట్టుటలచేత, మోహయతి = మోహింపఁజేయు చున్నాఁడో, సర్గస్య=సృష్టియొక్క, రక్షణార్థాయ=రక్షణము కొఱకు, మోహాత్మనే = మోహింపఁజేయు స్వరూపియగు, తస్మై = ఆ విష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఎవ్వఁడీ సర్వభూతములను ఇంద్రియజ్ఞాన సంపన్నములను ప్రేమ, అభిమానము, బాంధవ్యము, అను బంధనములు చేఁగట్టివేసి సృష్టి రక్షింప మోహపెట్టుచున్నాఁడో (ఆ స్నేహాదులు లేనిచో సృష్టిజరుగదు.) అట్టి మోహస్వరూపుఁడగు విష్ణువునకు నమస్కారము. అహంకార, మమకారములను (నేను, నాది) అవిద్యాబీజములను నెలకొల్పి సంసార వృక్షమును బెంపొందించుచు తత్త్వమును మఱుగుపఱచు వాఁడు, మోహస్వరూపుఁడు.

విశేషము : జగమునందు ఇదివఱకు నొకరినొకరుగు ర్తెఱుంగనిసమస్త వ్యక్తులు, మనుష్యులుగాని, జంతువులుగాని, పక్షులుగాని భార్యాభర్తలై ప్రవర్తించుట చూచుచున్నాము. పరస్పరము వారికిఁగల యత్యంతప్రేమ, వారికిఁ గలిగిన సంతానమునెడ వీడనివాత్సల్యము. వారికింతకు ముందు లేకుండి తర్వాతఁ గలిగిన ధనకనకవస్తువాహనాదులం దత్యంత మమకారము గలుగుచున్నది. తల్లితనకన్న బిడ్డయెడ నెంతయో ప్రేమఁజూపి యా బిడ్డకే యాపదరానీక కంటినిఱెప్పవలెఁ గాపాడుచుండుట లోకవిదితము. ఇదియ స్నేహపాశబంధము

మఱి చనిపోవునప్పుడొకరినొకరు వదలిపోవుట నిక్కముకదా, దాని నెఱింగియు నభిమానము వదలుకొనలేరు. అదియే మోహము. తానుగాని దేహేంద్రియాదులు తాననుకొనుట, తనవిగాని పుత్రకళత్రాదులు తనవియనుకొనుటయే అజ్ఞానము, దీనిని అవిద్యయందురు ఇదియ మోహస్వరూపము. దీనిఁగలిగించువాఁడు భగవంతుఁడే. దీని తత్త్వమెఱింగి దీనివలని ప్రయోజనము శూన్యమని తెలిసి యట్టిస్నేహములఁ ద్రెంచుకొని యేటికి నెదురీదినట్లు విషయేచ్ఛలనుండి విముఖులైనవారే బ్రహ్మమునుగాంతురని భావము.

## 40. మత్స్యావతారము.

శ్లో. భూతలాతలమధ్యస్థౌ హత్వాతు మధుకైటభౌ
ఉద్ధృతా యేన వై వేదా స్తస్మై మత్స్యాత్మనే నమః. 80

టీక. భూతల + అతల + మధ్యస్థః = భూలోకమునకు అతలమను అధోలోకమునకు నడుమనున్నవాఁడై, (సముద్రమునందు) (ఎవఁడు.) మధుకైటభౌ=మధుకైటభులను అసురులను, హత్వా = చంపి, (చంపెనో) యేనవై = ఏ దేవునిచేతనైతే, వేదాః = వేదములు, ఉద్ధృతాః=ఉద్ధరించఁబడినవో, మత్స్యాత్మనే = మత్స్యస్వరూపుఁడగు, తస్మై = ఆ మహావిష్ణువునకు నమః = నమస్కారము.

తా. భూలోకము, అతలలోకమునకు నడుమనిల్చి అనఁగా (సముద్రగర్భమునందుండి) మధుకైటభులను రక్క-

సులఁ ద్రుంచి వేదములనుద్ధరించి మత్స్యస్వరూపుఁడైన మహా విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

క. మీనయితా నతలగతం
బైన నిగమచయము దెచ్చి యజునకు నొసఁగం
గా నేర్చిన సుమనస్సు
మ్మానిత విగ్రహు భజింతు మత్స్యాత్మహరిన్. 19

వేదములు రెండుమాఱులుద్ధరింపఁ బడినట్లు దెలియవచ్చెడు. మధుకైటభులను రాక్షసులు వేదములను దొంగిలికొని రసాతలమున అశ్వతరిరూపమున (ఒక జాతిగుఱ్ఱము) దాచిరి. అప్పుడు విష్ణువు హయగ్రీవావతారమెత్తి ఆ యసురులను సంహరించి వేదముల నుద్ధరించెను.

ఇట్లు రామాయణము - కిష్కింధాకాండమునఁగలదు.

వాలి చెప్పినది :

శ్లో. న్యస్తాం సాగరతోయేవా పాతాళేవాపి మైథిలీం
ఆనయేయం తవాదేశా చ్ఛ్వేతామశ్వతరీమివం.

శ్వేతామశ్వతరీ మివ మధుకైటబాభ్యాం పాతాళే నిరుద్ధాం శ్వేతాశ్వతరీరూపాం శ్రుతిం హయగ్రీవోయథా అని వ్యాఖ్య

మత్స్యరూపియగు విష్ణువు మధుకైటభులఁ జంపినట్లు కానరాదు. విష్ణువే వారిని సంహరించెను.

శ్రీమద్భాగవతము అష్టమస్కంధము - మత్స్యావతార కథయందు హయగ్రీవుఁడను రాక్షసుఁడు (సోమకాసురుఁడు) బ్రహ్మ, నిద్రావస్థయందున్న తఱి వేదములహరించి పాతాళమున నుంచెననియు వాని మత్స్యరూపియగు విష్ణువు. హయగ్రీవుఁడను రక్కసుని సంహరించి వేదములఁ దెచ్చి యజునకొసఁగినట్లు గలదు.

శ్లో. కాలేన గతనిద్రస్య ధాతుశ్చ శయిషోర్జలే
ముఖతో నిస్సృతాన్ వేదా హయగ్రీవోంతికేఽహరత్
అతీత ప్రళయాపాయ ఉత్థితాయచ వేధసే
హత్వాఽసురం హయగ్రీవం వేదాన్ ప్రత్యాహరద్ధరిః.

దేవీభాగవతమునను మధుకైటభ సంహారకుఁడు హయగ్రీవుఁడైన విష్ణువే.

ఆ కథ నిటనను సంధించుకొనవలెను.

41. కూర్మావతారము.

శ్లో. ససాగరావనాం బిభ్రత్సప్తద్వీపాం వసుంధరాం
యోధారయతి పృష్ఠేన తస్మై కూర్మాత్మనేనమః. 81

టీక. యః=ఏ దేవుఁడు, ససాగరవనాం=సముద్రములతోను అరణ్యములతోను గూడినదియు, బిభ్రత్ + సప్తద్వీపాం = భరించుచున్న యేడుదీవులు గలదైన, వసుంధరాం=భూమిని, పృష్ఠేన = వీఁపుచేత, ధారయతి=ధరించుచున్నాఁడో, కూర్మా

త్మనే = కూర్మస్వరూపుఁడగు, తస్మై = ఆ నారాయణునకు నమః = నమస్కారము.

తా. సముద్రములతోడను, అరణ్యములతోడను గూడి యేఁడుదీవులను భరించుచున్న భూదేవిని ఎవఁడు తనవీఁపుమీఁద భరించెనో కూర్మస్వరూపుఁడగు ఆ శ్రీ మహావిష్ణునకు నమస్కారము.

క. అమృత మథనమున మంథన
గము లీలోద్ధరణ కేలిఁగైకొని సుర సం
ఘమునకుఁ బ్రియమొనరించిన
యమేయుఁ గూర్మాత్మునంబుజాక్షుని గొలుతుక్. 20

42. వరహావతారము.

శ్లో. ఏకార్ణవే హి మగ్నాంతాం వారాహంరూప మాస్థితః
ఉద్దధార మహీం యోఽసౌ తస్మైక్రోడాత్మనేనమః. 83

టీక. యః=ఏ దేవుఁడు, ఏకార్ణవే=జగమంతయు నొక్కటిగ జలార్ణవమైయుండగా నందు, మగ్నాం = మునిగిపోయిన తాం + వసుంధరాం + హి = ఆ భూమినైతే, వారాహం = వరాహసంబంధ (సూకర) మైన, రూపం = రూపమును, ఆస్థితః = గ్రహించియుండువాఁడై, ఉద్ధదార = ఉద్ధరించెనో, క్రోడాత్మనే = వరాహస్వరూపుఁడగు, తస్మై = ఆ శ్రీ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. జగమంతయు జలార్ణవమైయుండఁగా హిరణ్యాక్షుఁడను అసురుఁడీ భూమిని గైకొనిపోయి జలాంతర్భాగమునఁ దాచియుంచెను. అప్పుడు హరి వరాహరూపమును దాల్చి యా రక్కసుని జెండాడి జలములమునింగి యున్న భూమిని పైకెత్తినిల్పెను. అట్టి వరాహరూపియగు విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

క. వారాహరూపమునఁ బెం
పారిన తనదంష్ట్రిNొకట నవని సగిరి కాం
తారంబుగ నెత్తిన యా
శౌరిం గ్రోడాత్ముఁ దలఁతు సమ్యగ్భక్తిన్. 21

43. నృసింహావతారము.

శ్లో. నారసింహంవపుః కృత్వా యస్త్రైలోక్య భయంకరమ్
హిరణ్యకశిపుం జఘ్నే తస్మై సింహాత్మనేనమః. 88

టీక. యః = ఏ వైకుంఠుఁడు, త్రైలోక్యభయంకరం = మూఁడు లోకములకు భయమును గలిగించునదైన, నారసింహం = నరుఁడు సింహము అను రెండింటి సంబంధమైన, వపుః = శరీరమును, కృత్వా = చేసి, (ఆ రూపమును ధరించి యనుట) హిరణ్యకశిపుం = ఆ పేరి యసురుని, జఘ్నే = చంపెనో, సింహాత్మనే = నరసింహ స్వరూపుఁడగు, తస్మై = ఆ శ్రీకృష్ణునకు, నమః = నమస్కారము.

తా. ఏ దేవుఁడు పాదములు మొదలు నడుముదనుక మనుష్యరూపము నడుము మొదలు శిరస్సుదాఁక సింహరూపమును గలిగి ముల్లోకములకు భయముగల్గించుతనువు ధరించి హిరణ్యకశిపుఁడను రక్కసునిఁ జీల్చివైచి లోకములకు క్షేమమావహిల్లఁ జేసెనో అట్టి నరసింహస్వరూపుఁడైన బ్రహ్మమునకు నమస్కారము చేయుచున్నాను.

ఆ. వె. నారసింహవపు రుదారభావము నొంది
ఘను హిరణ్యకశిపు ఖరనఖముల
వ్రచ్చి దీప్తమూర్తి వఱలు నృసింహాత్ము
నాత్మభవుని భక్తి నాశ్రయింతు. 22

## 44. వామనావతారము.

శ్లో. వామనం రూప మాస్థాయ బలిం సంయమ్య మాయయా
ఇమేక్రాంతా స్త్రియోలోకా స్తస్మై క్రాంతాత్మనేనమః. 84

టీక. యః = ఎవఁడు, వామనం + రూపం = పొట్టిదైన రూపును, ఆస్థాయ = గ్రహించినిల్చి, మాయయా = వంచనముచేత, బలిం = బలియను అసురప్రభువును, సంయమ్య = కట్టి, ఇమే = ఈ, త్రయః + లోకాః = మూఁడు లోకములు, క్రాంతాః = (ఎవనిచే,) ఆక్రమించఁబడినవో, క్రాంతాత్మనే = విక్రమస్వరూపుఁడగు, తస్మై = ఆ విష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు పొట్టివడుగు రూపమునుబొంది మాయచే బలిచక్రవర్తినిబంధించి యీ మూఁడులోకములు మూఁడడుగులతో నాక్రమించి విక్రమించినట్టి త్రివిక్రమస్వరూపియగు విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

క. వామనరూపంబున ను
ద్దామబలుఁ బలినడంచి త్రైలోక్యాతి
క్రామతఁ బేర్చిన యద్భుత
ధాముం గ్రాంతాత్ముఁ దలతు దామోదరునిన్. 23

45. పరశురామావతారము.

శ్లో. జమదగ్నిసుతో భూత్వా రామః పరశుధృగ్విభుః.
సహస్రార్జునహంతైవ తస్మై ఉగ్రాత్మనేనమః. 85

టీక. జమదగ్నిసుతః = ఎవఁడు జమదగ్నియను మహర్షి కుమారుఁడై, భూత్వా = ఉండి, రామః = రాముఁడను పేరు గలవాఁడై, పరశుధృగ్ = గండ్రగొడ్డలి ధరించినవాఁడై, విభుః = సమర్థుఁడై, సహస్ర + అర్జున + హంతాఏవ = వేయి హస్తములుగల కార్తవీర్యార్జునికి హంతకుఁడైనవాఁడో, ఉగ్రాత్మనే = దారుణమైన, స్వరూపముగల, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము,

తా. ఎవఁడు జమదగ్నియను మహర్షికి సుతుఁడై పుట్టి రాముఁడనుపేరుగలిగి గండ్రగొడ్డలిచేపట్టి వేయిచేతులుగల

కార్తవీర్యార్జుని సంహర్తయైనాఁడో ఉగ్రస్వరూపుఁడగు భార్గవరామునకు మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

ఆ. వె. పరశురాముఁడనంగ భవ్యుండు జమదగ్ని
కుద్భవించి యిరువదొక్కమాఱు
మనుజపతుల నెల్లఁ దునిమిన క్రోధాత్ము
నధికభక్తి శార్ఙ్గి నాశ్రయింతు. 24

46. శ్రీరామావతారము.

శ్లో. రామోదాశరథిర్భూత్వా పౌలస్త్యకుల నందనమ్
జఘాన రావణం సంఖ్యే తస్మై క్షత్రాత్మనేనమః. 86

టీక. యః = ఎవఁడు, దాశరథి = దశరథుని కుమారుఁడై, రామః + భూత్వా = శ్రీరాముఁడను పేరుగలిగినవాఁడై, సంఖ్యే = యుద్ధమునందు, పౌలస్త్య + కుల + నందనమ్ = పులస్త్యుఁడను ప్రజాపతి వంశములో జన్మించిన సుతుఁడైన, రావణం = రావణుఁడను రాక్షసనాథుని, జఘాన = చంపెనో, క్షత్రాత్మనే = క్షత్రియులలో మిన్నయైన రూపుగల, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఏ దేవుఁడు దశరథుఁడను రాజుకొమారుఁడై రాముఁడన వర్ధిల్లి పులస్త్యబ్రహ్మసంతతి జనించి లోకకంటకుఁ

డైన రావణుని సంగరరంగమున సంహరించెనో, లోక క్షేమము గలిగించెనో, క్షత్రియకులమణియైన శ్రీరామునకు ఆ మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

క. క్షత్రాత్ముఁ గొలుతు దశరథ
పుత్రుఁ శ్రీరాముఁడనఁగఁ బొలిచిన దేవుఁ
శత్రుభయదు రావణు నొక
మాత్రం దునుమాడినట్టి మధుసూదనునిఁ. 25

క. హలముసలధరునిఁ గరుణా
నిలయహృదయు రాము రౌహిణేయు సితాంగుఁ
జలదనిభాంబరు నీశుం
దలఁతును గోవిందు శౌర్యధను భోగాత్ముఁ. 26

## 47. శ్రీకృష్ణావతారము.

శ్లో. వసుదేవసుత శ్శ్రీమా న్వాసుదేవో జగత్పతిః
జహార వసుధాభారం తస్మై కృష్ణాత్మనే నమః. 87

టీక. ఏ దేవుఁడు వసుదేవసుతః = వసుదేవుఁడను ప్రభునకు సుతుఁడై, శ్రీమాన్ = శ్రీమంతుఁడై, వాసుదేవః = వాసుదేవుఁడను పేరుగలవాఁడై, జగత్ + పతిః = లోకములకుఁ బ్రభుఁడై, వసుధాభారం = భూభారమును, జహార = హరించెను, కృష్ణాత్మనే = శ్రీకృష్ణస్వరూపముతో నున్న, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఏ దేవుఁడు వసుదేవుఁడను భూజాని తనూజుఁడై శ్రీమంతుఁడై వాసుదేవుఁడను నామధేయము గలవాఁడై జగత్ప్రభుఁడై, ప్రసిద్ధికెక్కఁ గన్పించి ఈ భూభారమంతటినిఁ దొలంగించెనో, అట్టి శ్రీకృష్ణునకు సాక్షాన్నారాయణమూర్తికిఁ బరబ్రహ్మమునకు నమస్కారము చేయుచున్నాను.

మ. యదువంశంబున వాసుదేవుఁడనఁ గ్రీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావళిఁ గూల్చి పార్థునకు సారథ్యంబు త్రైలోక్య స
మ్మదమారంగ నొనర్చి దేవముని సమ్మానోద్ధతిన్ భూ భరం
బు దొలంగించిన చక్రినంబురుహనాభుం గొల్తుఁగృష్ణాత్మకున్

48. బుద్ధావతారము.

శ్లో. బుద్ధరూపం సమాస్థాయ సర్వరూప పరాయణః
మోహయన్ సర్వభూతాని తస్మై మోహాత్మనే నమః. 88

టీక. బుద్ధరూపం = (ఎవఁడు) జ్ఞానమునుబొందిన బుద్ధుని రూపమును, సమాస్థాయ = గ్రహించినిల్చి, సర్వరూప పరాయణః = సర్వభూతములయందు దయాళువై, సర్వభూతాని = అన్ని భూతములను, మోహయన్ = మోహింపఁ జేయుచుండునో, మోహాత్మనే = మోహస్వరూపుఁడగు, తస్మై = ఆ ముకుందునకు, నమః = నమస్కారము.

తా. ఎవ్వఁడు బుద్ధరూపమునుగ్రహించి సర్వభూతములయందును మిగులదయాళుఁడై భూతములన్నింటిని మో

హింపఁజేయుచు మోహస్వరూపుఁడైన యా శ్రీకృష్ణునకు నమ
స్కారము చేయుచున్నాను.

49. కల్క్యవతారము.

శ్లో. హనిష్యతికలే రంతే మ్లేచ్ఛాం స్తురగవాహనః
ధర్మసంస్థాపనార్థాయ తస్మై కల్క్యాత్మనే నమః. 89

టీక. (ఎవఁడు) కలేః = కలియుగముయొక్క, అంతే = చివరిదశయందు, తురగవాహనః = అశ్వమును వాహనముగా గలవాఁడై, ధర్మసంస్థాపనార్థాయ = ధర్మముయొక్క స్థాపించుటకొఱకు, మ్లేచ్ఛాన్ = మ్లేచ్ఛులను, హనిష్యతి = చంపఁబోవునో, కల్క్యాత్మనే = కల్కిస్వరూపుఁడగు, తస్మై = ఆ దామోదరునకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు కలియుగాంతమునందు గుఱ్ఱమును వాహనముగాఁ జేసికొన్నవాఁడై (ఖడ్గధారియై) ధర్మమును చక్కఁగఁ బ్రతిష్ఠించుటకొఱకు మిగుల దుష్టులైన మ్లేచ్ఛుల నందఱిని సంహరింపఁగలఁడో కల్కిస్వరూపుఁడగు నా శ్రీమహావిష్ణువునకు నమస్కారము.

క. కలికాల చలిత ధర్మము
నిలుపంగలయట్టి విష్ణునిం గల్క్యాత్మున్
దలఁతుఁ దురగవాహను మ్లే
చ్ఛుల నెల్లంగీటడంచు శుభచారిత్రున్. 28

50. జ్ఞానాత్మ.

శ్లో. ఆత్మజ్ఞానమిదం జ్ఞాత్వా జ్ఞాత్వా పంచస్వవస్థితమ్
యంజ్ఞానేనాభిగచ్ఛంతి తస్మై జ్ఞానాత్మనేనమః. 90

టీక. పంచసు = జ్ఞానేంద్రియములైదింటియందు, అవస్థితం = ఉన్నట్టి, జ్ఞానం = జ్ఞానమును, (వినుట, స్పృశించుట, చూచుట మూర్కొనుట చవిచూచుట అను జ్ఞానమును) జ్ఞాత్వా = ఈ తెలిసికొనుటకు మూలకారణమేదియని యెఱుంగుటయే, ఇదం = ఇది, ఆత్మజ్ఞానం = పరమాత్మకు సంబంధించిన జ్ఞానము, యం = ఏ బ్రహ్మమును, జ్ఞానేన = పైని పేర్కొన్నట్టి జ్ఞానముచేత, అభిగచ్ఛంతి = పొందుదురో, జ్ఞానాత్మనే = జ్ఞానస్వరూపుఁడగు, తస్మై = ఆ బ్రహ్మమునకు (విష్ణువునకు) నమః = నమస్కారము.

తా. ఏ బోధ మనస్సునావరించి యా మనస్సు నింద్రియముల వెలయించి యా యింద్రియములద్వారా శబ్దాది విషయముల నైదింటిని బక్కఁగఁ దెలిసికొనుచున్నదో ఆ బోధరూపమునకు (ఆ జ్ఞానమునకనుట) మూలకారణ మెఱుంగుట యనునదియే ఆత్మజ్ఞానము అట్టి ఆత్మజ్ఞానముచే జ్ఞానులే పరబ్రహ్మమును బొందుచున్నారో జ్ఞానస్వరూపుఁడగు (ఎఱుక, తెలివియే రూపుగఁగలవాఁడగు) పరబ్రహ్మమైన విష్ణువునకు నమస్కారము.

శ్లో. పరాగర్థప్రమేయేషు యాఫలత్వేన సమ్మితా
సంవిత్తైనవహా మేయార్థో వేదాంతోక్తి ప్రమాణతః.

పరాగర్థములైన జ్ఞానేంద్రియములచేఁ బ్రపంచమున నెఱుంగఁదగిన శబ్దాదులందు ఏది ఫలముగా సమ్మతమో ఏ జ్ఞానముచే వీని నెఱుంగుచున్నామో. ఆ సంవిత్సే ఆ జ్ఞానమే వేదాంతవాక్యముల ప్రమాణముచేఁ దెలిసికోఁదగినది అని ఉదాహరింపఁబడినది.

51. దివ్యాత్మ.

శ్లో. అప్రమేయశరీరాయ సర్వతోబుద్ధిచక్షుషే
అనంతపరిమేయాయ తస్మైదివ్యాత్మనేనమః. 91

టీక. అప్రమేయ + శరీరాయ = ఇంద్రియములకు గోచరముగాని స్వరూపముగలవాఁడును, సర్వతః = అంతటను, బుద్ధిచక్షుషే = బుద్ధియు నేత్రములుగలవాఁడును, అనంత + పరిమేయాయ = అంతములేని జ్ఞానులు తెలిసికోఁదగిన విషయములు, సత్యజ్ఞానానందాదికము, మహిమలు గలవాఁడునగు దివ్యాత్మనే = ఉత్తమోత్తమ స్వరూపుఁడగు, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. పరిమాణమున కందనిదియు ఇంద్రియములకు గోచరము కానిదియునగు స్వరూపముగలవాఁడును అంతట బుద్ధినేత్రములు (సర్వేంద్రియముల ధర్మములు) గలవాఁడును,

తెక్కింపశక్యముగాని నాశముగాని కల్యాణగుణములు గల వాఁడును, ఉత్తమోత్తమ మూర్తియగు నా మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

52. బ్రహ్మ.

శ్లో. జటినే దండినే నిత్యం లంబోదరశరీరిణే
కమండలు నిషంగాయ తస్మై బ్రహ్మాత్మనే నమః. 92

టీక. జటినే = జడలుగల వాఁడును, దండినే = దండము గల వాఁడు, లంబ + ఉదర + శరీరిణే = వ్రేలాడు బొజ్జతోడి శరీరము గలవాఁడును, కమండలు నిషంగాయ = చేతనున్న జలకమండలువే అమ్ములపొదిగాఁ గలవాఁడును, బ్రహ్మాత్మనే = బ్రహ్మస్వరూపుఁడగు, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. జడలుదాల్చి దండముఁ జేపట్టి బొజ్జవ్రేలుచుండు శరీరముతోనొప్పి కమండలువే అమ్ములపొదిగాఁ గలవాఁడై (అనఁగా కమండలువునందలి జలములే బాణములు కాఁగా వానిచే నసురులను నాశముచేయువాఁడని భావము) బ్రహ్మదేవుని రూపముననుండు నా మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

కమండులు జలములభిమంత్రించి చల్లినంతటనే అవి బాణములై యసురులఁ జెండాడునని భావము.

53. రుద్రుఁడు.

శ్లో. శూలినే త్రిదశేశాయ త్ర్యంబకాయ మహాత్మనే
భస్మదిగ్ధోర్ధ్వలింగాయ తస్మై రుద్రాత్మనేనమః. 93

టీక. ఎవ్వఁడు, శూలినే = త్రిశూలముగలిగి, త్రిదశ + ఈశాయ = దేవతలకు నియామకుఁడై, త్రి + అంబకాయ = మూఁడుకన్నులుగలిగి, మహాత్మనే = మహాత్ముఁడై, భస్మ + దిగ్ధ + ఊర్ధ్వలింగాయ = విభూతిపూఁతగలదైన పైకివ్యాపించిన లింగస్వరూపుఁడై, రుద్రాయ=రుద్రస్వరూపుఁడైన, తస్మై= ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు త్రిశూలమును ధరించి దేవతలకుఁబ్రభువై మూఁడునేత్రములుగల మహాత్ముఁడై భస్మమంతట నలంది యుండి ధవళకాంతుల వెదజల్లు నూర్ధ్వలింగ స్వరూపుఁడై వెలయుచున్నాఁడో రుద్రస్వరూపుఁడగు (శివుఁడగు)పరబ్రహ్మమునకు నా విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

54. ఉగ్రుఁడు.

శ్లో. చంద్రార్ధకృతశీర్షాయ వ్యాళయజ్ఞోపవీతినే
పినాకశూలహస్తాయ తస్మై ఉగ్రాత్మనేనమః. 64

టీక. చంద్రార్ధ + కృత + శీర్షాయ = అర్ధచంద్రునిచే నలంకృతమైన శిరముగలవాఁడును, వ్యాళ + యజ్ఞోపవీతినే = సర్పములు జంధెములుగా గలవాఁడును, పినాకశూలహస్తాయ=

పినాకమను ధనుస్సు, త్రిశూలము అను రెంటింటిని ధరించిన హస్తములు గలవాఁడును, ఉగ్రాత్మనే = ఉగ్రస్వరూపుఁడైన (భయంకరుఁడు) తస్మై = ఆ మహావిష్ణువునకు నమస్కారము.

తా. ఎవ్వఁడు అర్ధచంద్రుని శిరోభూషణముగాఁ జేసికొని మహాసర్పముల యజ్ఞోపవీతములుగ ధరించి పినాకమను ధనుస్సును, త్రిశూలమును హస్తములందుధరించి యుగ్రస్వరూపుఁడై యున్నాఁడో ఆ మహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

౫౫. శాంతాత్మ.

శ్లో. సర్వభూతాత్మభూతాయ భూతాదినిధనాయచ
అక్రోధ ద్రోహ మోహాయ తస్మై శాంతాత్మనేనమః. 95

టీక. ఎవఁడు, సర్వభూత + ఆత్మభూతాయ = సర్వభూతములకు ఆత్మయైయున్నాఁడో, భూత + ఆది + నిధనాయ చ = భూతములకు సర్గప్రళయములు గావించువాఁడో లేక భూతాది + నిధనాయ చ = భూతములకు మొదలైన అహంకారము అనఁగా అది ప్రధానమైన సూక్ష్మశరీరము దాని నాశము చేయువాఁడో, అక్రోధద్రోహమోహాయ = క్రోధము, ద్రోహము, మోహము లేనివాఁడో, శాంతాత్మనే = శాంతస్వరూపుఁడైన, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఎవఁడు సర్వభూతముల కంతరాత్మయై ఆ భూతములను సృజింప లయింపఁ జేయ కర్తయై ఆ భూతముల సూక్ష్మ శరీరమును రూపుమాపుచున్నాఁడో అనఁగా తద్ద్వారా మోక్ష మొసంగుచున్నాఁడో, ఎవనియందు క్రోధము, ద్రోహము, మోహము అను చెడుగుణములు లేవో, అట్టి శాంత స్వరూపుఁడైన మాధవునకు నమస్కారము చేయుచున్నాను.

56. సర్వాత్మ.

శ్లో. యస్మిన్ సర్వం యతస్సర్వం యస్సర్వం సర్వతశ్చయః
యశ్చ సర్వమయోనిత్యం తస్మై సర్వాత్మనేనమః. 96

టీక. యస్మిన్ = ఏ దేవునియందు, సర్వం = సర్వ ప్రపంచము, (నిల్చియున్నదో) యతః = ఏ బ్రహ్మమువలన, సర్వం= అన్ని భూతములు పుట్టుచున్నవో, యః = ఎవఁడు, సర్వం = ఈ సర్వప్రపంచమైయున్నాఁడో, యః = ఎవఁడు, సర్వతః + చ = అంతటనిండియున్నాఁడో, యః + చ=ఎవఁడైతే, నిత్యం= ఎల్లప్పుడు, సర్వస్వరూపుఁడై యున్నాఁడో, సర్వాత్మనే = సర్వస్వరూపుఁడైన, తస్మై = ఆ మహావిష్ణువునకు, నమః = నమస్కారము.

తా. ఎవనియం దీజగమున్నదో, ఎవనివలన భూతరాశి అంతయు జనించుచున్నదో, ఎవఁడు సర్వప్రపంచ స్వరూపుఁడుగా నున్నాఁడో, ఎవ్వఁడు జగమంతట నిండియున్నాఁడో,

ఎవ్వఁడు సర్వముదానై యున్నాఁడో, అట్టి సర్వాత్మునకు విష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

క. సర్వమునందును దానుగ
సర్వముఁదనయందు నుండుసంచారంబుల్
సర్వమునకుఁ దనవలనన
సర్వాత్మకు నట్టికృష్ణ సత్తముదలఁతుఁగ. 29

57. విశ్వాత్మ.

శ్లో. విశ్వకర్మ న్నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వభావన
అపవర్గస్థ భూతానాం పంచానాం పరతః స్థితః. 97

టీక. విశ్వకర్మన్ = విశాలప్రపంచమును సృజించుఓ దేవా, తే + నమః + అస్తు = నీకు నమస్కారము అగుఁగాక, విశ్వాత్మన్ = విశ్వస్వరూపుఁడా, విశ్వభావన = విశ్వముచే సంభావింపఁదగినవాఁడా, భూతానాం = పంచభూతములకు, పరతః = వేఱుగా, స్థితః = నిల్చియున్నట్టి, అపవర్గస్థ = మోక్షధామము నందుండువాఁడా.

తా. విశాలప్రపంచమును (చతుర్దశభువనాత్మకమును) సృజించు ఓ దేవా నీకు నమస్కారము. ఓ విశ్వరూపా నీకు జోహారు. ఓ విశ్వకారణా నీకుఁ బ్రణామము పంచభూతముల కావలనుండు మోక్షధామముననుండు హరీ నీకు వందనము చేయుచున్నాను.

58. సర్వమయుఁడు.

శ్లో. నమస్తే త్రిషులోకేషు నమస్తే పరత స్త్రిషు
నమస్తే దిక్షుసర్వాసు త్వంహి సర్వమయోనిధిః. 98

టీక. త్రిషు + లోకేషు = మూఁడులోకములందు (నిండు కొనియున్న), తే + త్రిషు + నమః = నీకు మూఁడు కాలములందు నమస్కారము, పరతః=మూఁడు లోకములకంటె వేఱై యున్న, తే = నీకు, త్రిషు + నమః = మూఁడు కాలములందు నమస్కారము, సర్వాసు + దిక్షు = అన్నిదిక్కులందున్న, తే + త్రిషు + నమః = నీకుమూఁడు కాలములయందు నమస్కారము, సర్వమయః = సర్వస్వరూపుఁడైన, నిధిః = సర్వ భూతములకు లయస్థానమైనగనివి, త్వం హి = నీవేకదా.

తా. ముజ్జగములందు నిండుకొన్న దేవా! నీకు మూఁడు కాలములందు నమస్కారము. ఆ లోకములకంటెఁ బరుఁడవై తేజరిల్లుప్రభూ! నీకు త్రికాలములందు నమస్కారము. సమస్త దిశలందు వెలుంగు దేవా! నీకు నమస్కారము. సర్వము నీవేయై సర్వభూతములకు లయస్థానమై మోక్షమునిచ్చు ఖనివై (గని) న విష్ణూ! నీకు నమస్కారము చేయుచున్నాను.

59. సర్వకర్త.

శ్లో. నమస్తే భగవ న్విష్ణో లోకానాం ప్రభవాప్యయ
త్వంహికర్తా హృషీకేశ సంహర్తాచాపరాజితః. 99

టీక. భగవన్ = ఓ భగవంతుఁడా, విష్ణో = ఓ విష్ణూ, లోకానాం = లోకములకు, ప్రభవ+అప్యయ=ఉత్పత్తిస్థానమై

లయ కారణమైనవాఁడా, తే + నమః = నీకు నమస్కారము, హృషీకేశ=ఇంద్రియప్రవర్తకుఁడవైన ఓ ప్రభువా, త్వంహి= నీవే, కర్తా = సృష్టికర్తవు, అపరాజితః = పరాజయము లేనట్టి, సంహర్తా = లోకముల సంహరించువాఁడవు నీవే.

తా. ఓ భగవానుఁడా, ఓ విష్ణూ లోకములయుత్పత్తి లయములకుఁ గారణమైన దేవా నీకు నమస్కారము చేయుచున్నాను. ప్రాణుల యింద్రియములఁ బ్రవర్తింపఁజేయుట వలన హృషీకేశుఁడవని పేరుపొందిననీవు ఎప్పుడు పరాజయమునుబొందని సృష్టికర్తవును, లయకర్తవునయి యున్నావు.

60. సగుణ నిర్గుణము.

శ్లో. నహిపశ్యామి తే భావందివ్యం హిత్రిషువర్త్మసు
త్వాంతు పశ్యామి తత్త్వేన యత్తేరూపం సనాతనమ్. 100

టీక. త్రిషు + వర్త్మసు = మూఁడు కాలములందు లేక జాగ్రదాది అవస్థలు మూఁడుమార్గములు కర్మభక్తి జ్ఞానములు దేశకాల వస్తువులు, అనువానియందు, దివ్యం = అత్యుత్తమమై మార్పుపొందని, తే + భావం + హి = కేవలము సత్తామాత్రమై (ఉనికి)యున్న నీస్వరూపమునై తే (నిర్గుణతత్త్వము) నపశ్యామిహి = చూడలేకున్నానుగదా, యత్ = ఏది, తే = నీయొక్క. సనాతనం + రూపం = అనాదియైన స్వరూపమును సగుణమైన శేషశాయియై శంఖచక్రపీతాంబర శోభితమైన

రూపమై యున్నదో, త్వాంతు = ఆ రూపము గలనిన్నే, తత్త్వేన = సత్యమైన ఆత్మస్వరూపుగ, పశ్యామి = చూచుచున్నాను.

తా. భూతభవిష్యద్వర్తమానములను మూఁడు కాలములందును, దేశము, కాలము, వస్తువు. అను మూడింట నెద్దానను మార్పుగాంచనిదై జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందు నేకమై కర్మజ్ఞానమార్గములకును దుర్లభమై స్వయంప్రకాశమగుట దివ్యమై అత్యుత్తమమైన సచ్చిదానందమైన నీ నిర్గుణతత్త్వమును కేవలము సత్తామాత్రమును (ఉన్నది అను వ్యవహారమునకు మాత్రము లక్ష్యమైనది) నేను, వాక్కు, మనస్సు, క్రియ, అను మూఁడుసాధనముల చేతను జూడఁజాలకున్నాను. తత్త్వనిర్ధారణముచేయ నేదిలక్ష్యమై అనాదియై సగుణమై నిత్యమై సనాతనమై నీలవర్ణమై చతుర్భుజోపేతమై, శంఖచక్రాది స్ఫురితమై పుండరీకాక్షమై పీతాంబరముగలదై లక్ష్మీమనోహరమై, పద్మనాభమైన యేరూపముగలదో ఆ స్వరూపముగల నిన్నుమాత్రము సత్యస్వరూపుడగు విష్ణువునుగఁ జూచుచున్నాను.

61. విరాట్పురుషుఁడు.

శ్లో. దివం తే శిరసావ్యాప్తం పద్భ్యాం దేవీవసుంధరా
విక్రమేణ త్రయోలోకాః పురుషోఽసి సనాతనః. 101

శ్లో. దిశో భుజా రవిశ్చక్షు ర్వీర్యం శుక్రః ప్రజాపతిః
సప్తమార్గా నిరుద్ధా స్తే వాయోరమిత తేజసః. 102

టీక. ఓ భగవానుఁడా, తే+శిరసా = నీ యొక్క శిరస్సు చేత, దివం = స్వర్గము, వ్యాప్తం = వ్యాపించఁబడినది (ఆక్రమించఁబడినదనుట), పద్భ్యాం = నీ పాదముల చేత, వసుంధరా + దేవీ = భూదేవి, (ఆక్రమించఁబడినది) త్రయః + లోకాః = మూఁడులోకములు, విక్రమేణ = నీవు పెంపొందుటచే ఆక్రమింపఁబడినవి, సనాతనః + పురుషః + అసి = నీవు సనాతనుఁడవైన పురుషుఁడుగా నున్నావు.

టీక. ఓ భగవానుఁడా, దిశః = దిక్కులు, భుజాః = నీకు భుజములు, రవిః + చక్షుః = సూర్యుఁడు నేత్రములు, వీర్యం = బలము, పరాక్రమము, తేజస్సు, రేతస్సు, శుక్రః + ప్రజాపతిః = శుక్రుఁడను ప్రజాపతి, (అయిఉన్నారనుట) అమిత తేజసః = మిగుల తేజముగల, వాయోః = వాయువువలన, తే = నీయొక్క, సప్తమార్గాః = శ్రోత్రములు రెండు, నేత్రములు రెండు, నాసికా రంధ్రములు రెండు, నోరు ఒకటి కలిసి ఏఁడుమార్గములు నిరుద్ధాః = అరికట్టఁబడినవి. అనఁగా నాయాస్థానములందుండి వానిఁ బ్రవర్తింపఁ జేయుచున్నాఁడనుట లేక సప్తమారుతములై సప్తలోకములు వ్యాపించెననుట.

తా. ఓ శ్రీమన్నారాయణమూర్తి నీవు నీ శిరస్సుచే స్వర్గము నాక్రమించితివి. (అనఁగా నీకు స్వర్గము శిరస్సనుట) పాదములతో వసుంధరా దేవి నాక్రమించితివి. (భూమి నీ పాదములనుట) విక్రమముచేత (వామనుఁడై విశ్వరూప

మొంది సర్వము నాక్రమించుట) మూఁడులోకముల నాక్రమించితివి. (లోకత్రయము నీస్వరూపమనుట) నీవుసనాతనుఁడవైన పురుషుఁడవుగ (నిత్యుఁడు, పూర్ణుఁడనుట) నున్నావు.

తా. ఓశ్రీకృష్ణా నీకు దిక్కులు, భుజములు, సూర్యుఁడు, నేత్రములు, వీర్యము (బలము, తేజము, పరాక్రమము, రేతస్సులో నగునవి) శుక్రుఁడను ప్రజాపతియై యున్నారు. నీ శ్రోత్రచక్షుర్ఘ్రాణవదనములయొక్క సప్తమార్గములను (ఏడు రంధ్రములను) మహాతేజస్వి విక్రమశాలియగు వాయువు వ్యాపించి ప్రవర్తించుచున్నాఁడు. లేక ఆవహా, ప్రవహా, నివహా, సువహా, పరివహా, పరావహా, సంవహాములను సప్తమారుతముల రూపమున సప్తలోకములను వ్యాపించియున్నాఁడనియుఁ దెలియనగును.

క. ఆదిత్య మరుద్వసు రు
ద్రాది దివిజగణము నెల్ల ననయవ రూపో
త్పాద కలితు లెవ్వానికి
నా దేవుని సంస్తుతింతు హరి దేవాత్మున్. 30

62. ఫలము.

శ్లో. అతసీపుష్పసంకాశం పీతవాసస మచ్యుతం
యేనమస్యంతి గోవిందం నతేషాం విద్యతేభయమ్. 103

టీక. అతసీ + పుష్ప + సంకాశం = అగిసె చెట్టుపూవుల వన్నెవలె నీలమైన మేనిఛాయగలవాఁడును, పీతవాససం =

పసుపురంగు పట్టుపుట్టము గలవాఁడును, అచ్యుతం = స్థాన భ్రష్టత్వము లేనందువలన అచ్యుతుఁడను పేరుగాంచిన, గోవిందం = శ్రీకృష్ణుని, యే = ఏ భక్తులు, నమస్యంతి = నమస్కరించుచున్నారో, తేషాం = వారలకు, భయమ్ = సంసార భయము, నవిద్యతే = లేదు.

తా. అగిసెపూవువలె నీలివన్నెగల మేనివాఁడును, పసుపురంగు పట్టుపుట్టము ధరించినవాఁడునగు నచ్యుతుని, గోవిందునిగూర్చి, ఏ భక్తులు నమస్కరించుచున్నారో వారి కేవిధమైన భయముగాని జననమరణరూపమైన సంసార భయముగాని లేదు.

సీ. పరమేశ పుణ్య సుబ్రహ్మణ్య భక్తవ
త్సలమహాదేవ విశ్వప్రకాశ
శరణహృషీకేశ వరదనారాయణ
రాజీవనయన హిరణ్యనాభ
యఖిలలోక నమస్కృత్యాంఘ్రిసరోరుహ
యజ్ఞాంగ యచ్యుత యమృతరూప
నీకుమ్రొక్కెదఁ గరుణింపవే యతసీక
సుమవర్ణ పీతాంబరము ధరించి

ఆ. వె. యున్న నిన్ను నెవ్వ రుల్లంబునందుఁ ద
లంతురట్టివారలకు భయంబు
గలుగదెందు నేమి కార్యములందెప్డు
వినుత మంగళాయతనమవగుట. 31

శ్లో. ఏకోఽపి కృష్ణస్య కృతప్రణామో దశాశ్వమేధావభృథేన తుల్యః
దశాశ్వమేధీ పునరేతి జన్మ కృష్ణప్రణామీ నపునర్భవాయ. 104

టీక. కృష్ణస్య = శ్రీకృష్ణునకు, కృతప్రణామః = చేయఁబడిన నమస్కారము, ఏకః + అపి = ఒక్కటియైనను, దశ + అశ్వమేధ + అవభృథేన + తుల్యః = పదిఅశ్వమేధయాగములొనర్చి చేసిన అవభృథస్నానముతో సమానము. (యాగము కడపట దీక్షితుఁడైన యజమానుఁడు గంగాదిజలములతోఁ జేయు స్నానమునకు నవభృథస్నానమని పేరు), దశ + అశ్వమేధీ = పది అశ్వమేధ యాగములు చేసినవాఁడు, జన్మ = పుట్టువును, పునః + ఏతి = మరలఁ బొందుచున్నాఁడు, కృష్ణప్రణామీ = కృష్ణునకు నమస్కరించినవాఁడు, న + పునః + భవాయ = మరల జన్మించుటకొఱకు రాఁడు.

తా. శ్రీకృష్ణభగవానుని కొకపర్యాయము చేసిన నమస్కారము పది అశ్వమేధయాగములు చేసి యవభృథస్నానము చేసినంత ఫలముతో సమానమైనది. కాని, పదియశ్వమేధయాగములు చేసినవాఁడు పునర్జన్మము పొందును. శ్రీకృష్ణునికి నమస్కరించినవాఁడు పునర్జన్మకు రాఁడు. (మోక్షమునకుఁ బోవునని భావము.)

శ్లో. కృష్ణవ్రతాః కృష్ణమనుస్మరంతో రాత్రౌచ కృష్ణం పునరుత్థితాయే
తేకృష్ణదేహాః ప్రవిశంతికృష్ణమాజ్యంయథామంత్రహుతంహుతేషు. 105

టీక. యే = ఎవరు, కృష్ణవ్రతాః = కృష్ణునియందు, నియతమైన, భక్తియను వ్రతముగలవారై, రాత్రౌచ = రాత్రియం

దును, (అనఁగాఁ బండుకొనఁబోవునప్పుడును) కృష్ణం + అను స్మరంతః = శ్రీకృష్ణుని స్మరించుచున్నవారై, పునః = మరల నిద్రమేల్కొనునప్పుడు, కృష్ణం + అనుస్మరంతః = శ్రీకృష్ణుని స్మరించుచున్నవారై, ఉత్థితాః = నిద్రలేచుచున్నారో, (పడక మీాదనుండి లేచుచున్నారో) తే = ఆ భక్తులు, కృష్ణదేహాః = శ్రీకృష్ణునితో సమానమైన శరీరములుగలవారై, (శ్రీకృష్ణుని సారూప్యమును బొందియనుట) మంత్రహుతం = వేదమంత్రములచే హోమముచేయఁబడిన, ఆర్యం = పవిత్రమైన హవిస్సు హుతాశే + యథా = అగ్నిదేవునియందువలె, కృష్ణం = శ్రీకృష్ణుని (అందు) ప్రవిశంతి = ప్రవేశించుచున్నారు.

తా. ఎవరు శ్రీకృష్ణునియందు నియతమైన భక్తిగలవారై నిరంతరము కృష్ణుని స్మరించుచు, రాత్రులుపండుకొనఁబోవునప్పుడును మరల మేల్కొనునప్పుడును శ్రీకృష్ణుని స్మరించుచు పడకనుండి లేచుచున్నారో ఆ భక్తులు శ్రీకృష్ణులై శ్రీకృష్ణునిసారూప్యమొంది వేదమంత్రములచేఁ బవిత్రమై హోమము చేయఁబడు హవిస్సు (అన్నము) అగ్నిదేవునందు ఎట్లు జేరుచున్నదో అట్లే శ్రీకృష్ణునియందు బ్రవేశించుచున్నారు. (అనఁగా శ్రీకృష్ణునిసాయుజ్యము గాంతురనుట)

శ్లో. నమోనరకసంత్రాస రక్షామండలకారిణే
సంసారనిమ్నగావర్త తరికాష్ఠాయ విష్ణవే. 106

టీక. నర....రిణే నరక + సంత్రాస = నరకమును మహాభయమునుండి రక్షామండలకారిణే = రక్షించుటయను మండల

మును లేక పరివేషము (సూర్యచంద్రుల చుట్టునుండు పరివేషము (గాలిగుడి) వారికితరమైనది తగులక కాపాడునది) చేయువాఁడును, సంసార....ష్ఠాయ, సంసార + నిమ్నగా + ఆవర్త = సంసారమను నదిలోని సుడిగుండములందు మునిఁగి పోవువారికి, తరికాష్ఠాయ=(ఓడ) తెప్పకొయ్యయగు, విష్ణవే= శ్రీమహావిష్ణువుకొఱకు, నమః = నమస్కారము.

తా. ఏ హరి నరకమను మహాభయమును రానీక రక్షామండలము గావించునోఁసూర్యచంద్రులనుఁ బరివేషమను పేరుగలదై చక్రమువంటి గాలిగుడి ఎట్లితరములలోనికిఁ జొరనీక రక్షసేయునో అట్లే భక్తులకు భగవానుఁడు రక్షణ సేయుననుట) సంసారనదిలోని సుడిగుండములఁబడి మునుఁగుచుఁ దేలుచునుండు దుఃఖజీవులకు తెప్పకొయ్యయై యుద్ధరించునో ఆ శ్రీమహావిష్ణువునకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో. నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయచ
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయనమోనమః. 107

టీక. బ్రహ్మణ్య + దేవాయ = బ్రహ్మమనఁగా వేదము, తపము, తత్త్వము, ఈమూడింటి రూపమునొంది ఈమూఁడింటి యందు స్వయంప్రకాశుఁడైనవాఁడును, గో + బ్రాహ్మణ + హితాయచ=గోవులకు బ్రాహ్మణులకు హితుఁడైనవానికొఱకు నమః = నమస్కారము, జగత్ + హితాయ = లోకములకు

మేలు సేయునట్టి, కృష్ణాయ = శ్రీకృష్ణునికొఱకు, గోవిందా యచ = గోవిందునికొఱకును, నమః + నమః = నమస్కారము, నమస్కారము.

తా. ఏ దేవుఁడు వేదమయుఁడై, తపోమయుఁడై, తత్త్వస్వరూపుఁడై, స్వయంప్రకాశుఁడై తేజరిల్లుచున్నాఁడో, గోవులకు బ్రాహ్మణులకు హితముచేయువాఁడగు నా దేవునికి నమస్కారము చేయుచున్నాను. ఏ దేవుఁడు లోకములకు మేలు చేయుహితుఁడో ఆ శ్రీకృష్ణునకు గోవిందునకు మఱిమఱి నమస్కారము చేయుచున్నాను.

శ్లో. ప్రాణకాంతారపాథేయం సంసారోచ్ఛేదభేషజం
దుఃఖశోకపరిత్రాణం హరి రిత్యక్షరద్వయమ్. 108

టీక. హరిః + ఇతి = హరియను, అక్షర + ద్వయమ్ = అక్షరముల జంట, ప్రాణ + కాంతార + పాథేయం = ప్రాణములకు (జీవులకు) దుర్గమారణ్యమునందలి దారిబత్తెమై, సంసార + ఉచ్ఛేద + భేషజమ్ = సంసారమను మహావ్యాధిని సమూలముగ ఖండించు ఔషధమై, దుఃఖ + శోక + పరిత్రాణం = అనిష్టప్రాప్తివలని దుఃఖము, ఇష్టవియోగముచే నగు శోకము, అను నీ రెండింటినుండి లెస్సగఁగాపాడునది యునై యున్నది.

తా. ప్రాణములుఅనఁగా ప్రాణధారులగు జీవులు, బుట్టుట, చచ్చుట అను దేహములను బొందుట వీడుట అను

కార్యములగావించుచు నిహపరములకు రాకపోకలు సేయు చున్నారు. ఇహమునందు జీవయాత్రకై కృషివాణిజ్య పాశు పాల్య సేవా యాచనోద్యోగముల సేయుచు జీవింతురు. పర మునందిట్టి వృత్తులసాగింప వలనుగాదు. కనుక ఇహమునం గావించిన భక్తి పరమునరక్షించును. (అనంగా జీవులకుం బర లోక యాత్రయందు బాటసారులకు అడవిలో దారిబత్తెపు నూకలు జీవనాధారమైనట్లు హరియను రెండక్షరములు వారిని బ్రతికించుచున్నవనుట) అట్లే మొదతెగక బాధించు సంసార వ్యాధిని దుదముట్టఖండించు నౌషధము ఈ హరియను రెండక్ష రములే అనిష్టప్రాప్తి (తమకేమైన యుపద్రవములు వచ్చు నేమోయని వ్యథపడుట) వలన దుఃఖము, ఇష్టవియోగమువలన తను పుత్రపశువిత్తాదులు పోయినప్పుడు గలుగు వ్యథ, శోకము ఈ రెండింటి బాధలేకుండ రక్షించునది, ఈ హరియను రెం డక్షరములే అని తాత్పర్యము కావున నెల్లరు హరినామస్మర ణము నిరంతరము చేయవలసినదని ఉపదేశము.

శ్లో. యథావిష్ణుమయం సత్యం యథావిష్ణుమయంజగత్
యథావిష్ణుమయం సర్వం పాప్మామేనశ్యతాంతథా. 109

టీక. సత్యం = సత్యస్వరూపము, యథా = ఏ ప్రకారము, విష్ణుమయం = విష్ణుస్వరూపమైయున్నదో, జగత్ = జగము, యథా = ఏ ప్రకారము, విష్ణుమయం = విష్ణువు స్వరూపమై యున్నదో, సర్వం = సమస్తము, (ప్రాణికోటి) యథా = ఏ

ప్రకారము, విష్ణుమయం=విష్ణుస్వరూపమైయున్నదో, (అనఁగా సత్యము, జగము, సర్వము, విష్ణుమయమే అని నేనుపాసించుచున్నానని అందువలన) తథా = ఆ ప్రకారము (అట్లుపాసించువాఁడనైనందున విష్ణువుకంటె వేఱేమి లేదని తలంచువాఁడనైనందున) మే+పాప్మా=నా పాపము, నశ్యతాం = నశించుఁగాక.

తా. సత్యమైనది విష్ణుస్వరూపము, జగము, విష్ణుస్వరూపము. సమస్త జీవరాశి విష్ణుస్వరూపము, అని భావించువాఁడనైనందున విష్ణువుకంటె నన్యములేదని యెంచువాఁడనగుట నా పాపమునశించుఁగాక అని ప్రార్థించుచున్నాను.

తే. గీ. విష్ణుమయ మగ్ని హవియును విష్ణుమయము
విష్ణుమయము సర్వంబును విశదబుద్ధి
నిట్లగుటఁ గండుఁ గావున నించుకేనిఁ
గల్మషమునాకు లేకున్కిఁ గానవచ్చు. 32

శ్లో. త్వాంప్రపన్నాయ భక్తాయ గతిమిష్టాంజిగీషవే
యచ్ఛ్రేయః పుండరీకాక్ష తద్ధ్యాయస్వ సురోత్తమ. 110

టీక. త్వాం = నిన్ను, ప్రపన్నాయ = శరణుసొచ్చినవాఁడును, భక్తాయ = నీకు భక్తుఁడును, ఇష్టాం = ప్రియమైన, గతిం = మార్గమును, జిగీషవే = పోవఁగోరినవాఁడునగు నాఁకు, పుండరీకాక్ష = తెల్లదామరలవంటి కన్నులుగలవాఁడా, యత్ + శ్రేయః = ఏది శ్రేయమో (మేలో) సుర + ఉత్తమ=

సురలలోఁ శ్రేష్ఠుఁడా, తత్ = దానిని (ఆ సద్గతిని అనుట) ధ్యాయస్వ = (నాకుఁగల్గునట్లు) ధ్యానము చేయుమా తలంపుమా.

తా. ఓ ముకుందా నిన్నే నేను శరణుసొచ్చియున్నాను నీకు భక్తుఁడను, ఉత్తమగతిని బొందఁగోరుచున్నాను, కావున ఓ పుండరీకాక్ష ఏ సద్గతి నాకు శ్రేయమని తలంతువో సుర శ్రేష్ఠుఁడా. ఆ సద్గతినాకుఁ గలుగునట్లనుగ్రహింపుమా.

క. శరణాగతుండ భక్తుఁడ
బరమపదవిఁగోరెదను శుభంబుగనన్నుం
బరికించి యేది మేల
య్యెరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా. 33

శ్లో. ఇతివిద్యాతపోయోని రయోని ర్విష్ణురీడితః
వాగ్యజ్ఞే నార్చితో దేవః ప్రీయతాం మే జనార్దనః. 111

టీక. ఇతి = ఈ విధమున, విద్యా + తపస్ + యోని = బ్రహ్మవిద్యకును, తపమునకును, ఉత్పత్తిస్థానమై, అయోనిః = తన కేదియు నుత్పత్తి కారణము లేనివాఁడై, పుట్టుక లేని వాఁడైన, విష్ణు = విష్ణుదేవుఁడు, ఈడితః=స్తుతింపఁబడినాఁడు, వాగ్యజ్ఞేన = వాగ్రూపమైన యజ్ఞముచేత (ఇతర సామగ్రి యేమియు లేక వాక్కులచే స్తుతించు యజ్ఞముచే) అర్చితః = పూజింపఁబడినాఁడు కాఁబట్టి, దేవః = స్వయంప్రకాశుఁడైన, జనార్దనః = మహావిష్ణువు, ప్రీయతాం = నా స్తుతికిఁ బూజకుఁ బ్రీతిఁబొందుగాక.

తా. ఈ విధముగా బ్రహ్మవిద్యకును, తపమునకు నుత్పత్తి స్థానమై తాను జన్మరహితుఁడై నెలకొనియున్న శ్రీ మహా విష్ణువును స్తుతించితిని వాగ్రూపమైన యజ్ఞముచేత (అగ్ని, హవిస్సు, ఆజ్యము లోనగు సామగ్రియేమియు లేని యజ్ఞము చేతననుట) అర్చించితిని. ఈ రెండింటిచేత నే స్వయంప్రకాశుఁడైన జనార్దనుఁడు ప్రీతిఁబొందుగాక. నన్నురక్షించుఁగాక.

తే. తపమునకు విద్యకును జను స్థానమైన
జనన రహితుని యజ్ఞాత్మశౌరి వాఙ్మ
యాధ్వరార్చితుఁ జేసితి నాజనార్ద
నుండు మద్భజనమునఁ బ్రీతుండుగాత. 34

శ్లో. నారాయణపరంబ్రహ్మ నారాయణపరంతపః
నారాయణపరో దేవః సర్వంనారాయణస్సదా. 112

టీక. బ్రహ్మ = బ్రహ్మము, లేక వేదము, నారాయణపరం = నారాయణపరమైనది, అనఁగా కేవలము నారాయణ రూపమున వెలుఁగొందునది, తపః=తపము, నారాయణపరం= నారాయణుఁడే కేవలముగాఁగలది, దేవః = దేవతల సమూహము, నారాయణ పరః = కేవలము నారాయణుఁడు కారణముగా నుండునది, సర్వం = సమస్తము, సదా = ఎల్లప్పుడు, నారాయణః = నారాయణుఁడొక్కఁడే నిల్చియుండువాఁడు.

తా. బ్రహ్మమనఁగా (పరబ్రహ్మము, వేదము) నారాయణుఁడే తపము నారాయణుఁడే దేవతలెల్లరు నారాయణుఁడే

సర్వము నారాయణుఁడే నారాయణుఁడొక్కఁడే వెలుఁగొందు చున్నాఁడు. ఇవియన్నియు నారాయణాధీనములని భావము.

క. నారాయణపరములు నిజ
మారయఁ బ్రహ్మంబుఁ బరము నంచిత సత్యో
దారతపంబులు గావున
నారాయణపరత వినిన నాల్గిటికినిచ్చున్. 35

వైశంపాయన ఉవాచ -

శ్లో. ఏతావదుక్త్వావచనం భీష్మ స్తద్గత మానసః
నమఇత్యేవ కృష్ణాయ ప్రణామమకరో త్తథా. 113

వైశంపాయన ఉవాచ = వైశంపాయనుఁడు చెప్పెను.

టీక. భీష్మః = భీష్ముఁడు, తద్గతిమానసః = ఆ శ్రీకృష్ణుని యందు నిల్పిన మనస్సుగలవాఁడై, వచనం = మాటను (ఈ స్తుతిని) ఏతావత్ = ఈ విధముగా నింతమాత్రము, ఉక్త్వా = వాక్రుచ్చి, కృష్ణాయ = శ్రీకృష్ణునికొఱకు, నమః = నమస్కారము, ఇతి + ఏవ = అనుచునే, తథా = ఆ ప్రకారము, ప్రణామం = నమస్కారమును, అకరోత్ = చేసెను.

తా. భీష్ముఁడా శ్రీకృష్ణునియందు మనస్సునిల్పి యింత పర్యంతమిట్లు స్తుతించికడపట తన శిరము ముందుకువంచి తన రెండుచేతులు జోడించి శ్రీకృష్ణునికి నమస్కారమనిమాత్రము చెప్పి విరమించెను.

